## గంటల పంచాంగం

శ్రీజయ సంII కార్తీక శుII ద్వితీయ 1954 సంII అక్టోబరు 28 గురువారం శుII ద్వితీయ రా4-26వి॥ 28-60వర్జ్యం రా 4-0 ల 5-48 వ.

శుII తృతీయ అక్టోబరు 29 శుక్రవారం శుIIతృతీయ పూర్తి 60-0 అనూ రా2-31 వర్జ్యం లేదు.


ఆంధ్రపత్రిక

(శ్రీ జయ సంII కార్తీక శుII ద్వితీయ గురువారం)


## విమాన యాన సౌకర్యాలు

విజయవాడ రాష్ట్ర ప్రభుత్వ కార్యస్థానం కాలేదు. వివిధ శాఖల కార్యాలయాలను విజయవాడలో స్థాపించడం లేదు. రాష్ట్ర న్యాయస్థానాన్ని గుంటూరులో ఏర్పాటు చేశారు. ఇవన్నీ తాత్కాలికవు ఏర్పాట్లేనని ఆంధ్రమంత్రులు అప్పుడప్పుడు అంటున్నారు. రాష్ట్రపరిపాలనా యంత్రంలో విజయవాడకు ప్రాధాన్యం లేకుండా చేయడానికి ఎన్ని విధాల ఎందరు ప్రయత్నించినా, వారిప్రయత్నాలు ఫలించ లేదు. రాష్ట్ర రాజకీయార్థిక, సాంఘిక జీవితంలో విజయవాడకుగల ప్రముఖ స్థానంలో మార్పేమీ రాలేదు. ప్రభుత్వాల విధానాలు, వ్యక్తుల అభిమాన, అభిమతాలు భూగోళాన్ని మార్పు చేయలేవు.

కేంద్ర రాకపోకల శాఖా మంత్రి శ్రీ జగ్జీవన్‌రామ్‌గారు కర్నూలు, గుంటూరు, విజయవాడలను చూచారు. విజయవాడ సమీపంలోనున్న గన్నవరం విమానాశ్రయాన్ని పరిశీలించి, అక్కడ విమానాలు దిగడానికి, అక్కడ్నుంచి విమానాలు బయల్దేరటానికి గల ఏర్పాట్లు తృప్తికరంగావున్నట్లు భావించారు. మద్రాసు-ఢిల్లీ విమాన ప్రయాణంలో గన్నవరం వద్ద విమానాలు ఆగడానికి త్వరలో తగిన ఏర్పాట్లు చేయగలమని శ్రీ జగ్జీవన్‌రామ్ వెల్లడించారు. ఈ ఏర్పాటు లాభదాయకంగాను, ప్రయోజనకరంగానూ ఉంటుందేమో మూడు మాసాలు పరిశీలిస్తామన్నారు. ప్రజలు విమాన ప్రయాణానికి అలవాటు కావడానికి మూడుమాసాల వ్యవధి తక్కువని చెప్పాలి. రాష్ట్ర రాజధానులు అయినా, కాకపోయినా దేశంలోని ప్రధాన నగరాలన్నింటికీ విమానయాన సౌకర్యాలను కల్పించవలసిందేనని శ్రీ జగ్జీవన్‌రామ్‌గారు విజయవాడ పురపాలక సంఘంవారి సన్మానపత్రానికి సమాధానమిస్తూ చెప్పారు. అదే ప్రభుత్వ విధానమైనప్పుడు మూడు నాలుగు మాసాలు లాభనష్టాల స్థితిని విచారించవలసిన అవసరము లేదు.

మద్రాసు-ఢిల్లీ, మద్రాసు-కలకత్తా విమానాల మార్గాన్ని గన్నవరం మీదుగా మార్చినందువల్ల 30 మైళ్లుమాత్రమే ప్రయాణంచేయవలసిన దూరం ఎక్కువవుతుందని తెలుస్తున్నది. గన్నవరం విమానాశ్రయాన్ని వుంరుద్ధరించడంవల్ల ప్రయాణాల దృష్ట్యా ఈ 30 మైళ్ళ అదనపు ప్రయాణం అంతగా పరిగణించదగినదికాదు. శ్రీ జగ్జీవన్‌రాం గారు యీ విషయాన్నింటినీ శ్రద్ధగా విచారించి వీలైనంత త్వరలో గన్నవరం విమానాశ్రయం వద్ద ఢిల్లీ-మద్రాసు, మద్రాసు-కలకత్తా విమానాలు ఆగడానికి ఏర్పాట్లు చేయుదురని, ఈ ఏర్పాట్లు అధమపక్షం ఒకసంవత్సరమైనా అమల్లో వుండగలవని ఆశిస్తున్నాము.

## ఆయుర్వేద వైద్య ప్రచారం

విజయవాడలో ఆంధ్రఆయుర్వేద పరిషత్తు సభలు జయప్రదంగాజరిగినవి. రాష్ట్రంలో ఆయుర్వేద వైద్యప్రచారానికి పలువురు సూచనలు చేశారు. ఈ సూచనలన్నింటిలో ముఖ్యమైనవి రాష్ట్రీయవైద్య శాఖలో ప్రత్యేకం ఆయుర్వేద విభాగాన్ని ఏర్పాటు చేయడం, రాష్ట్రంలో అందరికీ అనుకూలంగా ఉండే పట్నంలో ఆయుర్వేద పాఠశాలను, కళాశాలను స్థాపించడం, కేంద్ర చికిత్సాలయ స్థాపనకు సంబంధించినవి.

ఆంధ్ర రాష్ట్రంలో ప్రభుత్వ ఆధ్వర్యాన ఆయుర్వేద వైద్య కళాశాలను స్థాపించడానికి దాదాపు నిర్ణయం జరిగింది. వచ్చే జులైనుంచి ఈ విద్యాసంస్థ ఏర్పడి వచ్చును. ఆయుర్వేద వైద్య విధాన వ్యాప్తికి ఒక కళాశాల చాలదు. ఆంధ్ర ప్రభుత్వం నియమించిన ప్రత్యేక సంఘం నివేదిక ఇంకా వెల్లడికాలేదు. కాని రాష్ట్రంలో ఆయుర్వేదసంస్థల స్థాపనా కార్యక్రమాన్ని నిర్వహించడానికి ఒక గౌరవ డైరెక్టరును నియమించవలసిందని ప్రతిపాదనను రాష్ట్ర ప్రభుత్వం ఆమోదించినట్లు, ఆ ప్రకారం ఒక గౌరవ డైరెక్టర్ను నియమించనున్నట్లు కర్నూలులో ఆరోగ్యమంత్రి శ్రీ సంజీవయ్యగారు చేసిన ప్రసంగం సూచిస్తున్నది. ఆయుర్వేద సంస్థల స్థాపనా కార్యక్రమం లోపరహితంగా జరగాలంటే, యీ విధంగా ఏర్పడే సంస్థలు ప్రజోపయోగకరంగా ఉండాలంటే ప్రభుత్వం ఇన్నటి నిర్ణయాన్ని మార్చుకోవలసి యుంటుంది. గౌరవ డైరెక్టరునుగాక ఒక ప్రత్యేకోద్యోగిని నియమించి, ఆ అధికారిద్వారా ప్రాతిపదిక చర్యలను పూర్తి చేయించడం మంచిది.

గౌరవడైరెక్టరు నియామకం అన్ని సంస్థలు ఏర్పడి పనిచేయ నారంభించినప్పుడు విచారణకు రావలసి యుండును. అయినా కేవలం మద్రాసులో అట్టి ఏర్పాటున్నదని, అదే యేర్పాటును ఆంధ్రలోనూ చేయాలని ప్రభుత్వం సంకల్పించడం వాస్తవిక దృష్టిని ప్రకటించదు. గౌరవపదవుల నిర్వహించువారు బాధ్యతలకిలీ ప్రవర్తించడం అరుదు. అంతకంటే వైద్యశాఖలోనే ఆయుర్వేద విభాగానికి ఒక డిప్యూటీ డైరెక్టర్ను నియమించడం మంచిది. ఏమలు ప్రభుత్వస్థాయిలో ప్రభుత్వ ప్రత్యక్ష పర్యవేక్షణక్రిందజరగ దానికి అవకాశం ఉంటుంది.

క్రొత్తగా ఒకశాఖను నెలకొల్పరా, ఆశాఖకు సంబంధించిన సంస్థలను స్థాపించనున్నప్పుడు ప్రాతిపదిక ఏర్పాట్లు లోపరహితంగా వుండాలి.

కొనర డైరెక్టరు నియామకం భవిష్యదభివృద్ధి ప్రతిబంధకమే అవుతుంది. ఈ విధానం సాధారణంగా అనుసరించేవిధానాలకు విరుద్ధంగా కూడా వుంటున్నది. జీతం ఖర్చు వుండదుగదా అని ఆశపడి గౌరవ డైరెక్టర్ను నియమించితే అందువల్ల వచ్చే లోపాలను సరిదిద్దుకోవడానికి ఖర్చుదాలా అవుతుంది. వీటన్నింటినీ విచారించి, గౌరవడైరెక్టరు నియామకాలోచనను విరమించి ఒక డిప్యూటీ డైరెక్టరును డైరెక్టర్ ఆఫ్ మెడికల్ సర్వీసెస్ క్రింద నియమించడంలో గల ప్రయోజనాన్ని ఆరోగ్యమంత్రి గ్రహిస్తారని, తదనుగుణంగా అంత్య నిర్ణయం చేయగలరని విశ్వసిస్తున్నాము.

## దక్షిణాఫ్రికాలో భారతీయులు
### ముఖాముఖి చర్చలకు అమెరికా సమర్థన

న్యూయార్కు, అక్టోబరు 26: దక్షిణాఫ్రికాలోని భారతీయులపట్ల ఆ ప్రభుత్వం ప్రదర్శిస్తున్న వైఖరిపై ఇండియా, పాకిస్థాన్, దక్షిణాఫ్రికాలు ముఖాముఖిని సంప్రతించుకు ఒక దారికి రావాలని సమితి రాజకీయ సంఘంలో క్యూబా, అర్జెంటీనా మొదలైన 7 రాజ్యాలు చేసిన ప్రతిపాదనను అమెరికా ఇవాళ సమర్థించింది.

అమెరికా ప్రతినిధి అలెగ్జాండర్ స్మిత్ ఇవాళ సమితి ప్రత్యేక రాజకీయ సంఘంలో ఈ విషయంపై ప్రసంగిస్తూ, సమితిలో ఈ విషయంపై తాను చర్చించేదిలేదు కాని, బయట అయితే సిద్ధమేనని దక్షిణాఫ్రికా లోగడ స్పష్టముగా చెప్పినదనీ, ఇప్పుడు దనమాట నిలబెట్టుకుంటుందో లేదో తేల్చవలసిన తరుణం వచ్చిందనీ అన్నారు. ఈసమస్య ఎలాగైనా ఒకదారిన పడగలదనే ఆశాభావం ప్రకటించారు.

సమితి సిద్ధాంతాలకు బద్ధమైన విపద్ధతిలోనైనా, దక్షిణాఫ్రికాను ఆకట్టుకు వచ్చి ఈ సమస్య పరిష్కరించడానికి జరిగే కృషిని పాకిస్థాన్ తప్పక పరిశీలిస్తుందనీ, పాకిస్థాన్ ప్రతినిధి డా॥ హమీదాలీ అన్నారు.

ముఖాముఖి చర్చలు జరగాలనే ప్రతిపాదనపట్ల ఆయనహర్షం ప్రకటించారు.

## విచారణ సంఘం అక్రమమని బ్రిటన్ విమర్శ

న్యూయార్కు, అక్టోబరు 26: దక్షిణాఫ్రికాలో జాతి విచక్షణ విధానంవల్ల ఏర్పడ్డ పరిస్థితులను పరిశీలనకు సమితి విచారణసంఘం నెలకొల్పడంవల్ల, ఒక సభ్యదేశం ఆంతరంగిక వ్యవహారాలలో అక్రమంగా జోక్యం చేసుకున్నట్లు అయినదనీ, అందువల్ల ఈ విచారణసంఘ నియామకం అక్రమమనీ బ్రిటన్ విమర్శించింది. సమితికి పంపిన రెండు లేఖలలో బ్రిటన్ ఈ విషయాని స్పష్టపరచింది.

### నివేదిక ప్రచురణ

సమితివిచారణసంఘం, దక్షిణాఫ్రికాలోని పరిస్థితులపై రచించిన నివేదిక నేడు ప్రకటించబడింది. దక్షిణాఫ్రికాలో జాతి విచక్షణ పరిస్థితులపై భారతప్రభుత్వం సమగ్ర వివరాలతో కూడినఒకవిజ్ఞాపికను తమకు సమర్పించినట్లు విచారణసంఘంవారు తమ నివేదికలో పేర్కొన్నారు.

సోవియట్ రష్యాలో జాతి, వర్ణ, మత, భాషా, లైంగిక, విభేదాలు పురస్కరించుకుని ఏమాత్రం విచక్షణ చూపడానికి ఆస్కారం లేదనీ, న్యాయం, ధర్మం దృష్టిలో అందరూ సమానులేననీ రష్యప్రతినిధి చెప్పినట్లు ఈ నివేదికలో పేర్కొనబడింది. (రాయిటర్)

## సింహళ భారతీయ సంతతి పౌరసత్వం
### ఉద్యోగుల సమావేశం వాయిదా

కొలంబో, అక్టోబరు 26: భారతీయ సంతతి పౌరసత్వం విషయమై చర్చించటానికి ఇవ్వాళ ఏర్పాటు చేయబడిన సింహళ, భారత ప్రభుత్వోద్యోగుల సమావేశం వాయిదా వేయబడింది. సింహళ ప్రధాని యీ సమావేశానికి హాజరు అయే సావకాశం లేనందువల్ల ఇట్లా వాయిదా వేయవలసి వచ్చిందనీ, మళ్లీ మూడు నాలుగు రోజులలో సమావేశం జరగవచ్చుననీ తెలిసింది.

భారతదేశంలో వరద బాధితుల సహాయార్థం రూ. 11,000/-లకు ఒక చెక్కును సింహళ ప్రధాని ఇవ్వాళ భారత ప్రతినిధికి అందచేశారు. ఈ మొత్తాన్ని ప్రభుత్వ ప్రతినిధుల పక్షాన కొంచిన 'గార్డియన్' అనే పత్రిక వసూలు చేసింది.

శాంతికి ప్రతినిధి వి. వి. గిరాయ్ నవంబరు 6 న ఈ పదవి విరమణ చేయబోతున్న సందర్భంలో ఇవ్వాళ విడ్కోలు విందు చేశారు. సింహళ ప్రధానికూడా విందులోపాల్గొన్నారు.

## కిద్వాయి మృతికి సంతాపం

న్యూఢిల్లీ, అక్టోబరు 27: రఫీఅహ్మద్ కిద్వాయి మృతికి సంతాపం ప్రకటిస్తూ భారత ప్రభుత్వానికి సంజ్ఞ పరంపర అందుతోంది. ఇవాళ బ్రిటిష్ ప్రభుత్వంనుంచి అట్టి సందేశం ఒకటి వచ్చింది.

## ఆయుధ విసర్జన సమస్యా పరిష్కారానికి ఇండియా సూచనలు
### సమితి ఉపసంఘ పరిశీలనకు నివేదించడానికి అగ్రరాజ్యాల సమ్మతి

న్యూయార్కు, అక్టోబరు 27: ఆయుధ విసర్జనపై అగ్రరాజ్యాలు ఒప్పందం కుదుర్చుకునేవరకూ, దీనిపై తాత్కాలికంగా రాజీకి చేసుకోడానికి కృషి చేయాలని సమితి రాజకీయ సంఘంలో ఇండియా చేసిన ప్రతిపాదనపై ఓటింగు జరుపకుండానే, దాన్ని పరాపరి ఆయుధ విసర్జన సంఘానికి పంపడానికి బ్రిటన్, ఫ్రాన్సు అమెరికా, కెనడా రష్యాలు నేటిరాత్రి అంగీకరించాయి.

ఇంతకుముందు పాశ్చాత్య అగ్రరాజ్యాలు నాలుగులోపాయకారీగా మాట్లాడుకుని ఈవిషయం సోవియట్ ప్రతినిధి విషిన్‌స్కీకి చెప్పగా ఆయన అందుకు అంగీకరించాడు. ఇందువిమిత్తం రాజకీయ సంఘంలో పశ్చిమ రాజ్యాలతో కలసి ఒక ప్రతిపాదన చేయడానికి విషిన్‌స్కీ సంసిద్ధత తెలిపారని కూడా ఇక్కడ పాశ్చాత్య వర్గాలవారు చెప్పారు.

### కృష్ణమీనన్ అభిభాషణ

ఆయుధ విసర్జన సమస్యపై పశ్చిమ రాజ్యాలకీ రష్యాకీ ఉంటూవచ్చిన విభేదాలు చాలా మట్టుకు సన్నగిలిపోయినవనీ, సర్దుబాటుద్వారా యీ సమస్యను పరిష్కరించడానికి అవకాశమిచ్చే స్థాయికి వచ్చారనీ భారత ప్రతినిధి వర్గనాయకుడు కృష్ణమీనన్ ఇవాళ సమితి రాజకీయ సంఘంలో చర్చ ముగిస్తూ అభిభాషించారు.

ఈయన విన్న ప్రతిపాదించిన తీర్మానంపై విషిన్‌స్కీ ప్రసంగం తరువాత, ప్రసంగించవలసి ఉండవలసింది. ఐతే, విషిన్‌స్కీ ప్రసంగం అవసంతో సమావేశం వాయిదా పడినందువల్ల అందుకు అవకాశం లేకపోయింది.

### చర్చల పునఃప్రారంభంపట్ల అగ్రరాజ్యాల ఏకీభావం

ఆయుధ విసర్జనపై అగ్రరాజ్యాలు అయిదూ లోపాయికారీగా చర్చలు తిరిగి ప్రారంభించాలని కోరుతూ పశ్చిమరాజ్యాలూ, రష్యాకలిసి ప్రతిపాదించిన తీర్మానంలోని వరతులపట్ల అగ్రరాజ్యాలు ఐదింటికీ యేకీభావం కుదిరిందనీ, సమితి రాజకీయసంఘం ఈ తీర్మానాన్ని, ఓట్లులెక్కించ నవసరం లేకుండానే ఆమోదించగలదనీ భావించబడుతున్నది.

యిండియా ప్రతినిధి కృష్ణమీనన్ చేసిన ప్రతిపాదన, ఈ చర్చలు ప్రారంభమయినపుడు, ఆయుధ విసర్జనపై తాత్కాలికంగా రాజీకివచ్చే విషయంలో సాధకబాధకాలు పరిశీలించాలనీ, ఈ సమావేశంలో జరిగిన చర్చ సందర్భంలో చేయబడిన సూచనలూ, ఆయుధ విసర్జన సంఘంలో సభ్యత్వం లేని సహకారం ఆకట్టుకు రావడానికి గల అవకాశాలూ విధానాలూ పరిశీలించాలని కోరుతున్నది.

### పశ్చిమ రాజ్యాల అభ్యంతరం

అయితే, కృష్ణమీనన్ ప్రతిపాదన విషయంలో పశ్చిమ రాజ్యాలు ముఖ్యంగా ఒక అంశంపై అభ్యంతరం చెబుతున్నాయట. ఆయన కోరినట్లు ఆయుధాల విషయంలో తాత్కాలికంగా ఒక ఒప్పందం కుదుర్చుకున్న ప్రతికీ దాన్ని గట్టిగా అమలు జరిపించే నిమిత్తం, దానికి కట్టుదిట్టంగా అజ్మాయిషీ చేసే నిమిత్తం కొంతయంత్రాంగం అవసరమనీ, నిరాయుధీకరణపై ఏర్పాటు చేసినా, మొట్టమొదట అవసరమైనది ఇదేననీ పశ్చిమ రాజ్యాలు వాదిస్తున్నాయని ఇక్కడి అభిజ్ఞలు చెప్పారు.

రాజకీయ సంఘం రేపు సమావేశమైనపుడు దీనిపై ఓటు జరపవచ్చు. కొందరు ప్రతినిధులు మాత్రం ఎల్లుండి వరకూ నిర్ణయమేమీ జరగదని చెప్తున్నారు.

### కృష్ణమీనన్ ప్రసంగం

సమితి రాజకీయసంఘంలో ఆయుధ విసర్జనపై సాధారణ చర్చను ముగిస్తూ ఇండియా ప్రతినిధి ఇవాళ 90 నిముషాలసేపు ప్రసంగించారు. ఆయుధ విసర్జన సంఘంగానీ, దాని ఉపసంఘంగానీ పరిశీలించవలసిన రెండు అంశాలు ఈ ప్రసంగంలో ఆయన ఉదహరించారు. ఇందులో ఒకఅంశం, ఆయన నిన్న ప్రవేశపెట్టిన తీర్మాన సారాంశమే.

పోతే, ఇవాళ ప్రసంగంలో ఆయుధవిసర్జనపై తను అన్నాయిష్టి చేయడానికి కొన్ని పద్ధతులు సూచించారు. అసలు "కంట్రోలు" గురించి ఆలోచించినప్పుడు అదంతా సాగించేది ఒక ప్రపంచప్రభుత్వమో లేదా దాన్ని మించిన, తిరుగులేని అంతర్జాతీయ సంఘమో ఉండాలని మాత్రమే భావించరాదనీ, ఇటువంటి కార్యాలు సాధించడానికి "సమ్మతి" అతి ప్రధాన అంశమనీ కృష్ణమీనన్ చెప్పారు. ఒక పోలీసు తన విద్యుక్త ధర్మాన్ని నిర్వహిస్తున్నాడంటే, ఆతడా పనులు చేయడానికి జనం అంగీకరించింది. అలాగే అంతర్జాతీయ సంఘం ఒకటి ఆయుధాలపై 'కంట్రోలు' చేయాలంటే, దానికి

(మిగతా 'అంతర్జాతీయ' అనుబంధం పేజీలో)

అంతర్జాతీయ సంఘం ఏర్పడగానే, అందుకు అంగీకరించినదేశాలు అన్నీ, దానిపై ఆమోదముద్ర వేసినప్పుడే, దానికి సంబంధించిన నియమ నిబంధనలు అన్నింటిని తమ తమ దేశాలలోని శాసనాలలో ఒకభాగంగా చేస్తూ వాటిని ఒక శాసనంగా చెయ్యాలి. అని కృష్ణమీనన్ వివరించారు.

ఈ సందర్భంలోనే ఆయన ప్రాశ్చ్యరూపమర్య దేశాలా పోలికరూ వివరించారు.

ఈయన ప్రసంగంలో పేర్కొన్న అంశాలు పశ్చిమ రాజ్యాలకూ, రష్యాకూ ఆయుధ విసర్జన సంఘంవిషయాలు అధికారాల విషయంలో ఉన్న భేదాభిప్రాయాలు తొలగించి, సన్నిహితులను చేయడానికి దోహదకారి కాగలదని ఇక్కడివారు భావిస్తున్నారు. (రాయిటర్)

## రాజా ధ్యక్ష విచారణ
### సహకరించమని బ్యాంకు ఉద్యోగుల సంఘం అధ్యక్షుని ప్రకటన

ఆగ్రా, అక్టోబరు 26: న్యాయమూర్తి రాజాధ్యక్ష అధ్యక్షతను కొనసాగే బ్యాంకుగుమాస్తాల కష్టాల విచారణలో తాము పాల్గొనమని అ॥ భా॥ బ్యాంకు గుమాస్తాల యూనియన్ అధ్యక్షుడు శ్రీ ఏ. సి. కక్కార్ అన్నారు.

ఇండియా ప్రభుత్వంవారు ఎప్పలేట్ న్యాయస్థానం తీర్పును సవరిస్తూ తాము చేసిన మార్పులను ఉపసంహరించుకోవాలి. అందాకా మాకు ఈ విచారణలతో ప్రసక్తి వుండదు అన్నారు.

బ్యాంకులవారు అప్పటే ఈమార్పిన అవార్డును అమలు జరుపుతున్నారని, అందువల్ల గుమాస్తాలకు నష్టం వాటిల్లుతున్నదని, శ్రీ కక్కార్ వివరించారు. అదీకాక ఈ రాజాధ్యక్ష కమిటీవారి ప్రభుత్వంవారు తటి సిఫార్సులు చేయవలసిందనిమాత్రం కోరారు. అందువల్ల గూడా మేము దీన్ని హర్షించడం లేదు. పైగా బ్యాంకులవాళ్లు తమ ఖాతా పుస్తకాలను ఈకమిటీకి మాత్రం చూపిస్తారని ఏమివుంది. కలకత్తాలోను అక్కడ బ్యాంకర్లు అప్పుడే ఈ విషయమై స్టే పిటీషనులు పెట్టుకొని, ఉత్తర్వులను సాధించారు. సుప్రీం కోర్టువారి అనుమతినిగూడా సాధిస్తున్నారు. ఇక అప్పుడు ఈ బ్యాంకుల స్థితిగతులనుగురించి వాటి ఆర్థిక ప్రవృత్తినిగూర్చి ఏ న్యాయస్థానం తెలుసుకోగల్గుతుంది? అన్నారు.

ఈ అన్ని కారణాలవల్ల బ్యాంకు గుమాస్తాలకు సమ్మెచేయడం తప్ప వేరే మార్గాంతరం కన్పించడంలేదు. అందువల్లనే డిశంబరులో సమ్మెచేయాలని నిర్ణయించాం. ఈలోగా ప్రభుత్వం తన మార్పిడి ప్రకటనను రద్దు చేసిందా సరే; లేదా సమ్మె తప్పదు. ఈ సమ్మెను నడిపించడంకోసం లక్ష రూపాయల నిధినిగూడా వసూలు చేస్తున్నాం అన్నారు.

## "మిత్రునికి వీడ్కోలు చెప్పడాన్ని మించిన దుఃఖం మరొకటి లేదు"
### భారత ప్రధాని తిరుగు ప్రయాణం సందర్భంలో చైనా అధ్యక్షుని అభిభాషణ

పెకింగ్, అక్టోబరు 26: మిత్రునికి వీడ్కోలు చెప్పటం కన్నా మించిన దుఃఖం మరొకటి లేదు. క్రొత్త మిత్రుల్ని సంపాదించటం కన్నా మించిన సంతోషం వేరొకటి లేదు" అని నవచైనా ప్రభుత్వాధ్యక్షుడు మావ్‌సేటుంగ్ నేడు భారత ప్రధాని నెహ్రూకు వీడ్కోలు ఇస్తూ, చైనా ప్రాచీన కవి చూయువెన్ రచించిన ఒక గీతాన్ని చదివారు. నేటి సాయంత్రం భారత ప్రధాని చైనా అధ్యక్షునివద్ద సెలవు తీసుకున్నారు. ఈ వీడ్కోలు సమావేశం గంటన్నర జరిగింది.

అనంతరం, భారత ప్రధాని చైనా నాయకులకు ఒక వీడ్కోలు విందు చేశారు. దానికి చైనా ఉపాధ్యక్షుడు చూటే, ప్రధానిచౌ ఎన్ లే ప్రభృతి నాయకులు, విదేశీ రాయబారులు మొదలైన అతిథులు 800 మందివచ్చేశారు. ప్రధాని చౌ ఎన్ లే ఆవిందులో ప్రసంగిస్తూ, అధ్యక్షుడు మావ్ సేటుంగ్ వెల్లడించిన అభిప్రాయాలు చైనా ప్రజల అభిప్రాయాలన్నిటినీ తెలియజేస్తున్నవని అన్నారు. తాను తిరిగి ప్రధాని నెహ్రూను కలుసుకో గలవని కూడా ఆయన సూచించారు.

### చారిత్రక నాయకుడు

చైనా అధ్యక్షుడు మావ్ సేటుంగ్‌ని గురించి ప్రశంసా ప్రస్తావనచేస్తూ ప్రధాని నెహ్రూ, చైనా ప్రజల ఆదర సత్కారాలకు కృతజ్ఞత తెలియజేశారు.

"ఒక ప్రముఖమైన కార్యనిర్వహణలో నిమగ్నమైవున్న పటిష్టమైన జాతిని నేను చైనాలో చూశాను. వారాశక్యంలో జయించ గలరని దృఢవిశ్వాసం నాకు వున్నది. ఈ జాతి మహానాయకుడు మావ్ సేటుంగ్‌ను నేను ఎంతగా మెచ్చుకుంటున్నానో ఇప్పుడు చెప్పకుండా వుండలేను. ఆయన చారిత్రక పురుషుడు. మహాయోధుడు. మహాతిర విప్లవకారుడు. గొప్ప నిర్మాత, కుశలుడు. నిర్మించిన దానిని నిలిపివుంచ గలవాడేటి. ఇప్పుడాయన గొప్ప శాంతి స్థాపకుడు కాగలడని ఆశిస్తున్నాను" అని నెహ్రూ ప్రశంసించారు.

"ఈనాడు దీపావళి. భారతదేశానికి ముఖ్యమయినరోజు. ప్రతి ఇల్లూ దీపాలతో ప్రత్యేకంగా అలంకరించబడుతుంది. అయితే, రెండురోజులకిందట ఇండియాలో జరిగిన ఒక దురదృష్ట సంఘటనవల్ల, అక్కడి ప్రజలు దానిని జరుపుకోవలసిన పద్ధతిలో జరుపుకోలేకపోయినారు. మా స్వాతంత్ర్య పోరాటంలోనూ, తరవాత ప్రభుత్వ నిర్వహణలోనూ కూడా నాకు సహచరుడుగా ఉన్న అత్యంత ప్రియమిత్రుడు ఆకస్మాత్తుగా, తన విధిని నిర్వహిస్తూ చనిపోయినాడు. అయితే ఎవరువచ్చినా, ఎవరుపోయినా, జాతిపని మాత్రం యథావిధిగా సాగిపోవలసిందే. మనమీద భారం పెరిగినప్పటికీ, అందులో ఆనందమే ఉండకూడదు" అని నెహ్రూ అన్నారు.

అనంతరం చైనా ఉపాధ్యక్షుడు చూటే భారతరాష్ట్రపతి నిగురించి ప్రశంసా ప్రస్తావనచేశారు. పార్లమెంటు స్థాయీ సంఘాధ్యక్షుడు లియూ షావ్ చీ భారత ఉపాధ్యక్షుడు డా॥ రాధాకృష్ణన్‌గురించి ప్రశంసా ప్రస్తావన చేశారు.

మావ్ సేటుంగ్ దగ్గర ప్రధాని నెహ్రూ సెలవు తీసుకున్నప్పుడు ఇందిరాగాంధీ, భారత విదేశాంగ కార్యదర్శి ఎన్. ఆర్. పిళ్లే, చైనాలో భారతరాయబారి రాఘవన్, ఇండియాలో చైనారాయబారి జనరల్ యువాన్, చైనా ఉపాధ్యక్షుడు చూటే, మదాం సన్యట్ సేన్ మొదలైనవారు అక్కడ ఉన్నారు.

### భారతప్రధానికి పెకింగ్ మేయర్ విందు

పెకింగ్ నగరపు మేయర్, పెంగ్ చెన్ నేటి మధ్యాహ్నం భారత ప్రధానికి వీడ్కోలుఇస్తూ ఒక పానీయాలవిందు చేశారు. దానికి ప్రధాని చౌఎన్‌లే, టిబెట్ ఆధ్యాత్మిక పాలకుడు పంచన్‌లామా, వివాకపాలకుడు దలైలామా, ఇతర ప్రముఖులు ఇందులో పాల్గొన్నారు.

## బంగీపెట్టెలో కూర్చుని పారిపోయిన హంగేరియన్

హాంబర్గు, అక్టోబరు 26: బంగీలపెట్టెలో కూర్చుని తిండీతిప్పలూ లేకుండా 9 వందల మైళ్లు ప్రయాణం చేసిన హంగేరియన్ యువకుడి అద్భుత గాథ నేడిక్కడ తెలియవచ్చింది.

ఇతడి వయస్సు 28 సంవత్సరాలు. పేరు ఇమర్ కొమొరాక్ స్కా.

బుడాపెస్ట్‌నుండి తప్పించుకొని పోవాలనే ఉద్దేశ్యంలో ఇతడు ఒక బంగీలపెట్టె పెట్టెలో కూర్చున్నాడు. ఆరురోజులలో గమ్యస్థానం చేరుకో వచ్చునసుకుని రెండుసీసాలతో నీళ్లూ, కొంచెంరొట్టె పట్టుకుని అందులో కూర్చున్నాడు. తరువాత ఆపెట్టె గూడ్సురైలులోకి ఎక్కించబడింది.

9 వందల మైళ్ల దూరంలో వున్న హాంబర్గు చేరడానికి వారం రోజులు పట్టింది అక్కడకి చేరక, ఆ పెట్టెని గూడ్సుషెడ్డులో పడవేశారు. ఇంకో వారంరోజులపాటు దిక్కూ దివాణం లేకుండా ఆపెట్టె అక్కడే ఉండిపోయింది. ఇతడు అందులో ఉండిపోయాడు. ఈవారంరోజులూ మంచి నీళ్లుకూడా లేకపోయాయి.

ఏడోరోజున ఈపెట్టెలోని ఆర్తనాదాలు విన్న ఒక కూలీ పలుగుర్ని పిలిచి ఆపెట్టె తెరచాక ఇతగాడు బయటపడ్డాడు.

(యు. పి. ఐ; ఎ. ఎఫ్. పి.)

## 19 రోజులు తుపానులో చిక్కుకుని దరి చేరిన పడవ

కొలంబో, అక్టోబరు 26: మాలి మోంఘాహూ అనే దీవికి చెందిన 18 మంది ప్రయాణికులు ఒక తెరచాపపడవపై మాన్ దీవికి బయలుదేరి, తుఫాను మూలంగా 19 రోజులపాటు హిందూ మహాసముద్రంలో దారి తెన్నూ తెలియకుండా తిరిగి నిన్న రాత్రి ఇక్కడకు సురక్షితంగాచేరారు వీరిలో ముగ్గురు స్త్రీలు.

21 అడుగుల పొడుగున్న యీ పడవలో వీరు 2 వేల కొబ్బరికాయలు వందచేంతాడు కట్టలు, రెండు బస్తాల సిమెంటు వేసుకుని 150 మైళ్ల దూరంలోని మాన్ దీవికి బయలుదేరారట. హఠాత్తుగా తుపానువచ్చి పడవని నడిసముద్రంలోకి తోసుకుపోయింది. 19 రోజులకు వీరు మళ్ళీ ఒకఒడ్డు చేరగలగలారు.

పుత్తాలం ప్రాంతానికి నిన్న ఇలాంటి పడవే ఇంకొకటి కొట్టుకు వచ్చిందట. (పి. టి. ఐ)

## సౌర, వాయుశక్తులపై న్యూఢిల్లీలో గోష్ఠి

న్యూఢిల్లీ, అక్టోబరు 21: సౌర, వాయుశక్తులనుగూర్చిన చర్చలనిమిత్తం ఇండియా ప్రభుత్వము, సమితి విజ్ఞాన సంఘము కలిసి ఏర్పాటుచేసిన చర్చ పరిషదు నేటితో ముగింపుకు వచ్చింది.

అనేక దేశాలనుంచి శాస్త్రజ్ఞులు వచ్చి తమ తమ దేశాలలో ఈ శక్తులను గూర్చి జరుగుతున్న పరిశోధనలను గురించి, వాటి ప్రయోజనాలను గురించి ఉపన్యసించారు.

సౌర శక్తికి, విద్యుచ్ఛక్తికి పోటీ పెట్టడం తగదని, విద్యుచ్ఛక్తిలో సౌర శక్తి పోటీ చెయ్యడం కష్టమని వీరిలో చాలామంది అభిప్రాయ పడుతున్నారు. అ... పోను, నా... లైన ... సంట... న్నారు. అయితే పనిశ్రీతి ఇది పోటీ చెయ్యగలవని, అయితే ఇది కొంత ఖర్చుతో కూడిందని చెబుతున్నారు.

## వెనకటి ఫ్రెంచి స్థావరాల్లో పురపాలక సంఘాల నియామకం

పుదుచ్చేరి, అక్టోబరు 26: ఫ్రెంచి ఇండియాలోని 12 వాడలలో మునిసిపల్ పరిపాలనను సాగించడానికి గాను ఒక్కొక్కవాడకు ఒక్కొక్క కమిషను చొప్పున 12 మునిసిపల్ కమిషన్లను యేర్పరుస్తూ ఆక్టింగ్ ఫ్రెంచి ఇండియా కమిషనరు ఈ వేళ ఉత్తరువు జారీ చేశాడు.

1948 అక్టోబరులో ఆరేళ్ళ వరకు ఎన్నిక అయిన మునిసిపల్ కౌన్సిలర్ల కాలము ఈ మాసం 24 తేదీతో అంతమైంది. కొత్త ఎన్నికలు జరిగే వరకు ఈనాడు నియమించబడిన మునిసిపల్ కమిషన్లు పురపాలనను నిర్వహిస్తవి.

పుదుచ్చేరిలో 18 మంది సభ్యులతో కూడిన మునిసిపల్ సంఘస్థానే 15 మందితో కూడిన మునిసిపల్ కమిషన్ను యేర్పరచడమైనది. ఇదివరలో మేయరుగా వుండిన శ్రీ ఎస్. ఎమ్. కాసిమ్ ఈ కమిషను అధ్యక్షుడుగా వుంటారు.

ఈ కమిషన్ల నియామకమునుగూర్చి శ్రీ కాసిమ్ ఏ. టి. వి. వారితో యీ క్రింది విధంగా చెప్పారు: "ఇప్పుడు మునిసిపల్ ఎన్నికలు జరపడం అసాధ్యమువనందువల్ల ఈ కమిషన్లను నియమించడమైనది. ఇట్టి కమిషన్లను నియమించడం యిదే మొదలుకాదు. ఎన్నికలు జరగవీలు లేనప్పుడల్లా యిట్టి కమిషన్ల నియామకం జరుగుతునే వున్నది. ఇదివరలో మునిసిపల్ సంఘ సభ్యులుగా వుండేవారినుండే యీ కమిషను సభ్యులను యెంచుకోవడమైనది. అయా మునిసిపాలిటీలకు కొత్త సభ్యులు ఎన్నిక అయ్యేటంతవరకు ఈ కమిషన్లు పురపాలన

(మిగతా 'అనుబంధం' సాగే పేజీలో)

## విలీనోద్యమ కాంగ్రెసు రద్దు

పుదుచ్చేరి, అక్టోబరు 27: ఫ్రెంచి ఇండియాను విముక్తిచేసి ఇండియాలో విలీనం చేయడంకోసం నిర్విరామకృషి జరిపిన ఫ్రెంచి ఇండియా విలీనోద్యమ కాంగ్రెసు నిన్న రద్దు చేయబడింది. దీన్ని రద్దుచేసే నిమిత్తం జరిగిన సమావేశంలోనే జాతీయ కాంగ్రెసుపక్షం నెలకొల్పబడింది. భారత జాతీయ కాంగ్రెసుకి దీన్ని అనుబంధించ కోరాలని ఈ సమావేశంలోనే ఏకగ్రీవంగా తీర్మానించబడింది. విలీనోద్యమ కాంగ్రెసు అధ్యక్షుడు సెలెన్ నాయకర్ ఈ సమావేశానికి అధ్యక్షత వహించారు.

కొత్తగా అవతరించిన జాతీయ కాంగ్రెసుకు ముర్యమొదలియార్ అధ్యక్షుడుగానూ, ఇబ్రహీం, పెరుమాళ్, రాబిలాన్‌గారు ఉపాధ్యక్షులుగానూ జ్ఞాన అంబ్రోస్ జనరల్ సెక్రటరీగానూ ఎన్నుకోబడ్డారు.

## పుదుచ్చేరిలో పోలీసులకు ఉద్వాసన

పుదుచ్చేరి, అక్టోబరు 26: స్థానిక పోలీసుదళంలో పనిచేయుటకుగాను ఫ్రెంచ్‌లో రిక్రూట్ చేసుకోబడిన వారందరినీ నవంబరు 1 నుంచి పునాదే ఉద్యోగం నుంచి తీసివేస్తున్నట్లు ముందుగా నోటీసులు యివ్వబడుతున్నవి. ఇదివరలో కొద్ది మాసాలుగా ఇచట ప్రారంభమైన రాజకీయ పునర్వ్యవస్థ సందర్భంలో స్థానిక పోలీసులకు సహాయంగా వీరు తేబడ్డారు. పి. టి. ఐ.

## సంపాదకునకు లేఖలు

### ఒంగోలు-చీరాలమధ్య రైలు ప్రయాణాలు

ఆర్యా, మెయిన్ లైనుమీద ఉన్న ఒంగోలు-చీరాల మధ్యగల స్టేషనులనుంచి ప్రయాణం సౌకర్యంగాలేదు. ఈ రెండు స్టేషనులమధ్య రైలుమార్గానికి దాపుగా బస్సుసౌకర్యంకూడాలేదు. విజయవాడనుంచి ఈ దయం బయలుదేరే పాసింజరు చీరాలకు ఉదయం 8 గంటలకు, ఒంగోలుకు 9-30 కు చేరుతుంది. ఆ తరువాత పాయంత్రం 5 గంటలకు ఒంగోలుచేరే పార్సెల్ బండిప్రపగలు నడిచేవుట్ల చీరాల-ఒంగోలుమధ్య స్టేషనులలో ఆగదు. ఈ పార్సెలుబండి రాకపోకలను వేరుచేసేదీయినది అందరికీ తెలిసినదే. ఇదివరకు సాయంత్రం ఒంగోలునుండి చీరాలకు వచ్చే పాసింజరు 5-30 కు ఒంగోలులో బయలు దేరుతుంది. ఆ తరువాత మరలా ఉదయంవరకు ఏ స్టేషనులో ఆగే బళ్లులేవు.

కనక విజయవాడ ప్రైవేటుగా వచ్చే జనతా ఎక్స్‌ప్రెస్ ఒంగోలుకు ఉదయం 11 గంటలకు చేరేటట్లు మద్రాసు నుంచివచ్చే జనతా ఎక్స్‌ప్రెస్ ఒంగోలుకు రాత్రి 7 గంటలకు చేరేటట్లు వేళలు సవరించి, ఈ రెండుబళ్లు చీరాల, ఒంగోలుమధ్యగల అన్ని స్టేషన్లలోను ఆగే ఏర్పాటుచేస్తే ఈ ప్రాంతాలకు రైలుప్రయాణాలు చాలావరకు ఉపయోగంగా ఉంటుంది.

ఒంగోలు. బాచిన సుబ్బారావు.

* * *

### ప్రభుత్వ చిత్రాలను ప్రదర్శించని కారణం

ఆర్యా! 'ఆంధ్రపత్రిక'లో ప్రభుత్వ ప్రచారచిత్రాల ప్రదర్శనను గురించి వెలువడిన సంపాదకీయ లేఖలను చూచాము. ప్రజలకు వాస్తవిక పరిస్థితిని తెలియజేసే నిమిత్తం వాటికి యీ సమాధానం వ్రాయుచున్నాము. మద్రాసు రాష్ట్ర సినిమాటోగ్రాఫ్ చట్టంలోని ఒక సెక్షన్ ప్రకారం ప్రతి ప్రదర్శనకు ముందు పాటు యెక్కువగా 2000 అడుగుల నిడివికి తగ్గని డాక్యుమెంటరీ చిత్రాలనుగానీ, వార్తాచిత్రాలనుగానీ చూపించవలసి వస్తున్నది. ఈ విధంగా ప్రభుత్వంవారు ఉత్తర్వులు చేయుటం రాజ్యాంగ చట్టప్రకారం న్యాయమని తలంచిన వ్యాపార స్వేచ్ఛాహక్కుకు భంగకారి అవుతున్నది. అందుచేత శ్రీ ఆర్. ఎం. సేతుపతి సినిమాటోగ్రాఫ్ చట్టంలో ఆటువంటి నిబంధన చేర్చవచ్చునా లేదా అనే విషయంలో న్యాయం తెలుసుకోవటానికి సుప్రీంకోర్టులో రిట్ దాఖలు చేశారు. సుప్రీంకోర్టువారి నిర్ణయంతో ఇదంతా తెలుస్తుంది. ఆ కోర్టు తుది తీర్పు ఇవ్వనంతవరకు ఈ చట్టం ప్రకారం చిత్రాల ప్రదర్శనను ఆపలేము. ఇప్పటికే అనేక చిత్రాల ప్రదర్శకులు చెల్లించవలసి వస్తున్నది. అయినను ప్రభుత్వం వారు ఆయా చిత్రాలు ప్రదర్శించకుండా ప్రదర్శకులవద్ద డబ్బు వసూలు చేస్తున్నారు. ఇలా ప్రదర్శకులు చెల్లించవలసి వస్తున్న సొమ్ము ఏటా పెరుగుతూ ఉంటున్నది. ఈ మధ్య ఈ విధంగా ఇంకా పెరిగింది. ఈ పెరుగుదలకు తగ్గ కారణం ప్రభుత్వంవారు చెప్పలేదు.

రాజ్యాంగం ప్రసాదించిన పౌరహక్కులు భంగపడకుండా ఉండేటందుకు ఈ విధంగా యజమానులు వార్తాచిత్రాలు, డాక్యుమెంటరీ చిత్రాల ప్రదర్శనను ఆపివేశారు.

అంతేకాని ఆ చిత్రాలు మంచివా కావా, ప్రజాదరణ పొందినవా కావా అనే విషయాన్ని మేము అపుడు కొడవ లేదు.

'ఎస్. కె. ఎస్. అయ్యర్, గౌ. కార్యదర్శి ఆంధ్రా ఫిలిం వాణిజ్య మండలి.

### సినీమా ప్రేక్షక సంఘాలకు విజ్ఞప్తి

ఆర్యా! విజయవాడలో సమావేశమయిన ఆంధ్ర ఫిలిం వాణిజ్యమండలి కార్యవర్గంవారు ప్రభుత్వం మీద కోపంతో వార్తాచిత్రాలు బహిష్కరించ తీర్మానించారు. వారి తీర్మానాన్ని నిరసించవలసిన ప్రదర్శకుల వార్తాచిత్రాలు మానివేశారు. వీరి ఉద్దేశ్యప్రకారం ప్రేక్షకులు బదిలీలు కోవాలి! ఈ చిత్రాలు ఇస్తున్న విజ్ఞానాన్ని నార్దాహంచి ఇస్తున్నాయని ప్రేక్షకులకు బాగా తెలుసును. ప్రేక్షకులు వార్తాచిత్రాలు లేకుండా చిత్రాలు చూడదలచిన నిర్వాహకులుంటే తిరిగి కొద్దిరోజులలోనే వారు నిర్ణయం మార్చుకోవలసి వుంటుంది. సినిమాప్రేక్షకుల సంఘాలు ఆలోచించి ఈ విషయంలో శ్రీరావుపొంది ఉన్నది.

మచిలీపట్నం. పేరిచర్ల భాస్కరరావు.

## తిరునల్వేలిలో ఎగిరేపళ్లెం

తిరునల్వేలి, అక్టోబరు 26: 'మేఘమేపించడం' నిన్నటిరోజునల్ల XX సమాధాన రాత్రి 7 గంటలకు నీలరంగు కాంతి విరజిమ్ముతూ, ఎర్రని అంచు కలిగిన ఒక "ఎగిరేపళ్లెం" ఎటూ కండేటివంటా ప్రకాశిస్తూ దక్షిణంనుంచి ఉత్తరానికి వేగంగా ప్రయాణంచేసింది. ఇది ఏదో అంతరిక్ష సంఘటనై వుండివుండునని కొందరు, కాదు, ఇది ఏదో దైవికమైన వస్తువని కొందరు వింతగా చెప్పుకుంటున్నారు. (పి. టి. ఐ.)

# తెఱచిరాజు

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

మోహినీ రుక్మాంగదుల సమాగమమునందు సారధికి దనస్మృతి తప్పలేదు. ఆమె నిజముగా మోహిని. తాను నిజముగా రుక్మాంగదుడు. తాను ధరించిన పాత్రతో దా నేకీభవించుట సారధి కిది క్రొత్తి కాదు. కాని శృంగారరసము క్రొత్తి. మోహినీపాత్ర వహించినది వాసంతి యైనను యుల్లసుభవించుట చిత్రము. తునకు నేకాదశీ శబ్దశ్రవణముతో నిజముగా మోహము విచ్చెను. అంతటి యుక్తికృతిలోగూడ సారధికి దనసారధిత్వ విస్మృతి కల్గెనా! ఒక తెలుగని మీదనుండునా! ఏనను ఈ పాక్షికమైన యుక్తికృతి చమత్కారమైనది. సంపూర్ణమైన తాదాత్మ్యమువలెనే భాసించును. తన యుక్తి యుండియు లేనట్లుండును. సర్వమానసిక వ్యవహారము తదాలోకిత విషయికముగానే యుండును. ఏకాదశీ శబ్దశ్రవణముచేత సారధి తల్లక్రిందులయ్యెను. తెరలో నుండి మూడుసారులు దప్పుమ్రోత వినిపించెను. దానిని వించుసారధి ప్రచండమైనమార్పు పొందెను. అదియొక విచిత్రమైన నిమేషము. సారధికి తాను సారధియని తెలియును. రుక్మాంగదుని యందధ్యాస పొందితినని తెలియును. అధ్యాసపాశైథిల్యం బయ్యని తెలియును. మోహితుడైన రుక్మాంగదుని యధ్యాస పోయి యేకాదశీవ్రత నిష్ఠాతుడైన రుక్మాంగదుని యధ్యాస ప్రారంభించెను. ఈ మార్పులో సారధిత్వము విస్పష్టమయ్యెను. తాను సారధినని తాను రుక్మాంగదపాత్రము నభినయించుచున్నానని పూర్వమునకంటె విస్పష్టముగా జ్ఞప్తికివచ్చెను. కాని రుక్మాంగదభావము వదలలేదు. ఒక సముద్రమునను జరిగినట్లు జరుగుచున్నది. అందునుండి కోలాహలము వెలికి వచ్చుచున్నది. తత్కాలమున సారధియొక్క శరీరవిన్యాసము ముఖావయవిన్యాసము చూచుటకు భయంకరమయ్యెను. సభాసదులు నిస్తబ్ధులైరి. అవధానికిగూడ దనరచనయందలి ధ్యాసముపోయెను. రంగనాధము ప్రశంసాపూర్వకముందహాసనుడయ్యెను. అతని కనలు మిడిగ్రుడ్లు. ఆ కన్నుల కదలిక తిర్యక్ప్రసార విసురమయ్యెను. అతని మొగము చూచుటతోడనే యొదో రాక్షసుడు కోపవివశుడై పాండి జవరాకార వికారదశా మహాబాధ ననుభవించుచున్నట్లు గోచరించెను. పదునాలుగేండ్ల పసిబాలిక వాసంతి చూచుచు నాదుముంబినస్మృతి విశ్వృతి నొర్వలేకపోయెను. ఆమెకు వయసువచ్చినది కాని సృష్టిరహస్యమేమి తెలియును? పదునాలుగేండ్లు వచ్చినంత వయసు సమకూరుటయు దద్గత భావనా పరంపరయు సర్వజంతువులకు సహజము. ఈ కామ భావము జీవునియొక్క వికాసము కాదు. అది శరీరముయొక్క వికాసము. ఆమె కదలిపోయెను, వణకుచుండెను. కన్నులయందు నీరుబుకుచుండెను. ఆమెస్థితిని సారధి చూచెను. ఆమె యుబ్బుచుకొని సోలబడి పోవుచుండెను. "నాయనా భయములేదు భయములేదు. ఓర్చుకొనుము ఓర్చుకొనుము." అని నోటిలో సారధి యామెను సమాశ్వాసించెను, ఆమెకు ధైర్యము కలుగుటకు నామె బుజముపై చేయివైచెను. ఆమె మొగము దన బుజముపై వానించికొనెను. ఇంక తన మొగమామె చూచుటలేదు. అప్పుడు సారధియొక్క విచిత్రమైన యభినయము ప్రకటించెను. దోసముగతయుం దనదికాని తన్ను మోహించ చేసిన స్త్రీదికాదు. ఆమెయందుం గోపించుట న్యాయముకాదు. లాలన చేయుండనామె నాదరించుట యుక్తమని ధర్మము. అచ్చట రెండు పద్యములున్నవి. సారధి వానినిం జదువుట మానివేసెను. అతని కనుసైగతోం దెర దింపబడెను.

అవధానికిం దన రెండుపద్యములు చదువుట మానివేయుట మిక్కిలి వెగులు కలిగించెను. ప్రక్కనున్న రాజాగారును మరియొక పెద్ద యుద్యోగస్థుడును విస్మయ మనుభవించుచుండిరి. అవధాని వారితో "రత్నపు గుళికలండీ రత్నపు గుళికలు. రెండు పద్యములు. నా కవితాశక్తియంతయు వానియందుం బెట్టితిని. అవి చదువుట మానివేసినాడండీ. అవి చదువుట మానివేసినాడు" అని మొత్తుకొట్టెను. మానవునియొక్క చిత్రమైనది. నిజముగా మాటాడినచో నందుం జిత్రములేదు. అతడు పొందు సమాధి బహిర్వ్యవహారప్రవృత్తి. దానినుండి వెలికి వచ్చుట మిక్కిలి సేలిక 'అవధాని గొప్పకవి డెబ్బదియేండ్లవాడు' అన్న లౌకిక భావము పెద్దది. సారధియొక్క యభినయ దర్శనముచేతం గలిగిన విస్మయలిప్త ప్రాంశిభాగ సంబంధమైన పరిచితముకాని యొక యనుభవము. అవధాని మాటలువిని వారు వింటనే తేరుకొనిరి. అహో! మానవుని యనుభూతి భిన్న సంస్కారములుకలిగిన మానవుల యనుభూతి, సోకరూపములయిన విషయములందుం దగుల్కొని రసజగత్తుయొక్క పొలిమేరలు చాల దవ్వునుండి చూచిన యల్పానుభూతి యెట్టిది. ఆ కనిపించినవిషయమే తెలియని యనుభూతి యెట్టిది. అవధాని వయసుచేతం బెద్దవాడు. అతడు గొప్పకవి యగునో కాదో వారికిం దెలియదు. లోకమునందభివ్యాప్తమైన యొక ప్రతీతిని నమ్ముటయే కాని వేఱుకాదు. ఆ పద్యములలోని మాటలే యితనికిని భావములితనివి కావని రాజాగారికింగూడం దెలియును. వినవలెనే కవియని రాజాగారనుకొందురు. సృష్టికంటె విచిత్రమైనది యిదే.

కొంతసేపటికి నాటకమైపోయెను. చివరిభాగమున సారధి వైరాగ్యభావ ప్రదర్శనముచేసెను. యోగశాస్త్రములోని రహస్యముల నన్నింటిని నభినయపూర్వకముగా నిల్లడించెను. సభలోం దచ్ఛాస్త్ర రహస్యములు తెలిసినవా రెవ్వరు లేరు. అభినేత సారధి గనుక నేదో గొప్పగా చేసినాడన్న మొద్దుభావమేకాని కునికిత పరిజ్ఞానములేని యా సభ సంగీతసాహిత్యాభినయ శిల్పవిద్యలను సామాన్యముగా నెట్లు చూచునో యట్లు చూచెను. ఇదియిది యని నిరూపించుకోగలిగిన పరిజ్ఞానము లేని మానవుని యనుభూతి యేమియనుభూతి? సారధియొక్క యభినయమంతయు మొత్తముమీద నిష్ఫలమనుభవింపబడుచున్నది. వరదల మీదనున్న గోదావరిని మనుజుడు చూచును.

హృషీకేశమువద్ద శిలల రాపాడుచేత వేగాతివేగమున మలకలై ప్రవహించుగంగానదిని జూచును హిమవంతమును జూచును వర్షాకాలమున సస్యసమృద్ధమై పచ్చికలతో నిండి బహు పుష్పములచేతం దెల్లగాగరా తాల్చిన కిబరకన్యలవోని వృక్షములు నిండియున్న దక్షిణదేశ మహాపర్వతములను జూచును ఏదో కొట్టవచ్చినట్లున్న స్థూలభావమేకాని మనుష్యుడింకేమియూ ననుభవించలేదు. విద్యాప్రదర్శనముజూచిన తరువాతం గలుగు ననుభూతియును పండితుల కిట్టిదే, పండితులకది నిబిధ్యమానమై తదనుభూతి స్వరూప లక్షణము గోచరింపజేయును అతనియొక్క ఈ యభినయ రహస్యము తెలిసినవారు సభలో నలుగురైదుగురు.

నాటకమైపోయినది. చివరిసారిగనే పద్యము జారినది. తొలుతటి వరుసలో గూర్చున పెద్దలు కొందఱవధానిని మాటాడుమనిరి ఇంచుమించుగా నందరును కోరిరి. అవధాని లేచెను వృద్ధుడయ్యె దేహపటుత్వము తగ్గినవాడు కనులు సరిగా కనిపించవు. కనుల కడియములున్నవి యది లేకపోయినచే యొక్కువ కనిపించును. రంగదేశముకథకోహించుటకు గొంచెము కష్టపడెను చిన్న యుద్యోగస్థు లొకరిద్దఱు సహాయముచేసిరి. ఆయన నిలుచుండి తొలుత గొంతుసవరించుకొనెను దంతములు సగానికి సగము లేవు ఇట్లు ప్రసంగించెను "సారధి చాల గొప్పవాడు. అతని నే నాశీర్వదించుచున్నాను మహాకవి వాక్కు యథార్థము యథార్థము. మన దేశములో నింతకంటె గొప్ప నటుడు లేడు, లేడు ముమ్మాటికిని లేడు అని నేను చెప్పుచున్నాను నాటకమంతయు! చక్కగా జేసినారు. అందరుచేసినారు. చిన్నపిల్లవానిదగ్గఱనుండి చక్కగా జేసినారు అంతయు బాగుగనేయున్నది కాని రత్నపు గుళికలవంటి పద్యములను వదలిపెట్టినాడు. వానిని నేను కష్టపడి వ్రాసినాను, కొత్తకోర్కెతో వ్రాసినాను నా మనస్సునకు గష్టము వేసినది. కాని సారధి గొప్ప నటుడు. నాటకములలో వేషము వేసిన వారి నందరిం దీవించుచున్నాను."

౨

వేషధారణాపాకరణములకు నేపథ్యముల వెనుకనున్న స్థలములో స్త్రీల కొక ప్రత్యేక స్థలమున్నది. ఆ సమాజములో స్త్రీవేషములు పూర్వము స్త్రీలే వేసెడివారు. ఈ స్థలము వాసంతి కొఱకే యేర్పాటు చేయబడినది. ఆ సమాజములో వాసంతి తప్ప మరొక స్త్రీ లేదు పురుషు లెవ్వరా రెవలసబోరు. మొదట నొక కొన్ని నెలలు వాసంతికి సవనిర్మాత వేషము వేయించెడివాడు. తరువాత వాసంతియే వేషము వేసికొనుట నేర్చినది. వేషము వేయుచుండగా దీయుచుండగా వాసంతి యందసార్లు సారధిని పిలుచును. కొజ్జెరమూని సీసా యొచ్చటనున్నదో ఫలానా ప్రత్యే యెచ్చటనున్నదో మాటిమాటికి సారధిని పిలిచియే యడుగును. నీ వచ్చుట మెంగకొంటినా నా నేను తెలియువని వచ్చి వెదకి యిచ్చుచుండును. ఒక్కొక్కప్పుడు కోపపడును. సారధి కోపపడినచో వాసంతి యేడ్చును. అతనికి కోపము పోవును.

సారధి వాసంతి తెలిపికించెను. చిన్నప్పటాడించెను. ఆమె కైదారేండ్లప్పుడు వాడామెను దంక కెత్తుకొని యింగ్లీషు జేసికొనిపోయి నాట్యలికి గొనిపోవుచుండెను. ఆమెకు వయసు వచ్చిన తరువాతగూడ నతనికి నామె తన బిడ్డవలెనే కనిపించెను. చిన్నప్పుడు వాసంతి యతనిపేరు సరిగారాక యాఅధి యని యనెడిది. అది క్రమముగా 'అధి' యని పిలుచుటగా మారెను. పెద్దదైన తరువాతగూడ ముద్దునకు గొన్నాళ్లు 'అధి' యనియే పిలిచెడిది. అది రూఢమై యామె యొప్పుడు నతని సాధి యనియేపిలుచును. అందరును సారథిగారందురు. ఆమె తండ్రియు సారథిగారే యనును. ఆమె తండ్రి మాటలలో "తెన్నియో సార్లు చెప్పెను." అనుపదము మేమి నెఱుగను. సారథిగారనవలయును అని. ఆమె తా సాధియే యందు ననును. సారథి నేను వాసంతికొధినే సారథిని కానునను.

ఆనాడు నాటకమయినంతనే వాసంతి తన గదిలోనికి బోయెను. తన వేషమును తానే తీసికొనెను. ఆ వేషము సరిగా దీసికొనుట చేతకాలేదు. చేతకాక కాదు, లోకములో నెవ్వరి కేపని చేతకాదు. ఇతరుల సాహాయ్యముతో మనుష్యు డొకపని చేయుచున్నచో నా సాహాయ్యము లేనప్పుడు తమకాపని సాధ్యముకాని వినిపించును. ఆ సాహాయ్యము లేనన్న దిగులెక్కుడై శ్రద్ధతక్కువై యామని చేతి కొంకర్లే జరుగును ... [illegible] ... ఆమెమనస్సు ... మంచమపై ... [illegible] ... తాను మోహినీ వేషము వేసికొన్న యుక్తి యున్నది. ఆ వేష మిప్పుడు తీసివేయవలయునన్న యభీష్ట యున్నది. ఈ సవ్యమైన యుక్తిస్థలను మించి యేదో యొక భావ మామె మనస్సు నావరించియున్నది. ఆ భావ మీ యభిజ్ఞల నావరించియున్నది. ఈ యభిజ్ఞలను క్రిందుసేయుచున్నది. అభావము యిమిత్తమని తెలియ లేదు. ఆ భావ మిట్టిదని తెలిసికొనుటకు ప్రయత్నముకూడ లేదు. సారధి శృంగారాభినయముకూడా లోకోత్తరముగా జేయగలడని యామె విశ్వాసము. లోకమున కా సంగతి తెలియదు. అతడేరసము నభినయించలేడు లోకమున కీ సంగతికూడా బుజావు చేయవలయునని యామె యుద్దేశము. అందుకొఱకే యింత ప్రయత్నము. ఇంతవఱకు దల. ఆ విషయము లోకమునకు బుజావు చేసినది. ఆ బుజావు చేయుటలో దన హృదయమునకు మరి యేదో సంగతి బుజావైనట్లున్నది. ఆ బుజావైన దేదో తనకు తెలియదు. ఆ బుజావైన భావము విస్పష్టము కాలేదు. అది యొక తెలుపుగా సిగ్గుగా నామె యందు గనిపించుచుండెను. ప్రతి నాటకాంతమునందువలెనే సారధిని పిలువవలె ననుకొనును. పిలువదు. ఏదో పిలువవద్దనుచున్నది. అది లజ్జయా భయమా సారధి తనకు గనిపించకూడ దన్నట్లున్నది. వేషము తీసి వేసి సారధికి గనిపించకుండ నింటికిబోద మనిపించుచున్నది. ఆమె యాలోచించుటకును దోచుటలేదు. విలువుటద్దము ముందు గూర్చుండి కర్ణాభరణములు తీసి వేసినది. మరల దనకు తెలియకుండనే పెట్టుకొన్నది. కర్ణాభరణములు తీసి వేసిన గురుతేగాని మరల దాల్చిన గుర్తులేదు. ఈ వేషము తీసి వేయుట తనకు సాధ్యముకాదు. సారధి లేకుండ తన కేపనియు సాధ్యముకాదు. తన వేషధారణము వేషాపాకరణము సారధి సాహాయ్యము లేక తనకు గొనసాగునదిగా కనిపించలేదు. ఆమె యెంత తొందరగా వేషముతీసి వేసి సారధికి గనిపించకుండ కేడోక్రతోవ నింటికిపోవుటకు వీలునో విచారించుచున్నది. విచారించుటలేదు. అట్లు చేయుటకు నామె ప్రకృతి తొందరించుచున్నది.

సారధి తన వేషమును తాను తీసికొనుచుండెను. తాను పూర్వమిట్టి వేషమును వేయలేదు. ఈ యాభరణములు ధరించలేదు. పూర్వము తాను వేసెడి వేషముల యందలి యాభరణములును దుస్తులును నాలోచన లేకుండ దీసి వేసెడివాడు అది యతనికి నాలిక ముప్పదియేండ్ల యనుభవము. ఈ మండలములు కేయూరములు హస్తాంగుళీయకములు మొదలయినవి తానుతీయుట కష్టమయ్యెను. అతడిబ్బంది పడుచుండగా మఱియొక వేషధారి వచ్చి యతనికి సాహాయ్యము చేసెను. సామాన్యముగా దాను వేషము తీసికొనక ముందు వాసంతి పిలుపు వినిపించెడిది. ముందచ్చటికి బోయి యామెకు సాహాయ్యము చేసి తరువాత తానుతన వేషము దీసికొనెడివాడు ఈనాడు వాసంతి పిలుపురాలేదు. పిలుపు రాకపోయినను తన యంతటదాను పోవచ్చును గద, నేడామె పిలుపు రాదన్న విషయము సారధి మనస్సునకట్లో తెలిపినట్లుండెను. ఆ పిలుపు వచ్చినను తాను వెళ్ళకూడదని తనకేదో చెప్పుచున్నట్లుండెను.

సారధి ప్రౌఢుడు, అవివాహితుడు. అతని శీలము గూర్చి యెవ్వరికిని మంచి యభిప్రాయములేదు. ఉండవలసిన యవసరము లేదని యతడే చెప్పుచుండును. లోకమునందు శీలము ద్వివిధాభూతము. ఈ రెంటిని రెండుగా మాచుట లోకము నేర్చుకొనవలయును. ఒకటి స్త్రీ సంబంధమైన శీలము రెండవది తదితర సర్వవిషయములకు సంబంధించినది. అబద్ధములు చెప్పుట మోసములు చేయుట దురహంకారమువలంబించుట పరద్రవ్యాపహారణము - నితరులయొక్క కాళ్లక్రింద గోతులు తీయుట తడిగుడ్డలతో గొంతులు కోయుట, నిలువున దీపమార్పుట తావయోగ్యుడై యోగ్యత కలవాని సుచిత కార్యమునుండి బహిష్కృతునిగా జేయుట ఇట్టివి లోకమునందు శతసహస్రాధికములైన దుష్టత్వములు కలవు. ఇవి యన్నియు నొకరాశి. స్త్రీగతకామ మొకరాశి. మంచి చెడ్డలు లేవు. వానివరుసలు లేవు. బంధువులు మిత్రులని లేదు. ఉచ్చనీచములు లేవు. ఇది యొకరాశి. ఈరెండుపక్షముల యందుదరతమ భావములు కలవు. ఈ రెండు పక్షములలో జాలభేదము కలదు. స్త్రీ విషయమున నామెయొక్క యామతూల్యము నామెయొక్క యంగీకృతి యామెయొక్క సమాపతియు గలవు. మొదటి కత్యలోనవి యెప్పుడు నుండవు. మొదటి కత్యకు సంబంధించిన యవినీతి సంపూర్ణముగా నవినీతి. స్త్రీసంబంధమైనదియు భయనిష్ఠమై పరులకు నపకారికాక రెంటిలో గొంతయుంచిన. తన భార్య తనచెల్లెలు పరపురుష సంగమము చేసినదని వానికి దెలియనిచో వాని మనస్సునకు గష్టములేదు. వాడు పడెడుబాధ లేదు. తెలిసిన తరువాత వాడు బాధపడినచో వాడు తన మీద వదియూహించుకొనిన బాధ. కొన్నియూహలు పెట్టుకొని యాయూహలవలన, దెచ్చికొనిన బాధ. ధనాది విషయమునట్లు కాదు. అబాధ ప్రత్యక్షముగా నన్నోదకముల విషయమున బ్రదుకుట విషయమున నాపత్తు కలుగ జేయుచున్నది.

మరియు స్త్రీ విషయమున నామె శీలవతి కానిచో సంసారిణి కానిచో వాపనివలన నొక గొప్ప యింటిప్రతిష్ఠకు భంగమురానిచో దానిలో, దప్పేమున్నది. కామము జంతు సహజము. స్త్రీ విషయమున నుత్తమకులముల యందు శీలవతులయందు స్వామ్యముండవచ్చును. బహు పురుషసంగమము చేయు స్త్రీ విషయములో నా స్త్రీ విషయములో స్వామ్యభావ మెందుకవలంబించవలయును. ఇది పట్టె స్వార్థపరత.

ఇది సారధియొక్క నీతిభావములో, గొంతభాగము. సారధి యట్టివాడు. అతడు నీతిమంతుడనియే చెప్పవలయును. ఒక కులస్త్రీని తాను కోరి యామెను ధనాదులచేత మోహపఱచి యామెను వశపఱచుకొనుటకు దానెప్పుడు ప్రయత్నించడు. కులస్త్రీయే తన యందభిలాష ప్రకటించినను సమ్యక్కుల మర్యాద పాటించి తానావంక తిరిగి చూడడు. మిత్ర గృహముల యందతడు పరమసాధువు పరమయోగి. అతని స్నేహితుల యిండ్లలో స్త్రీలతనితోనున్నంత దనవుగా మరియే యింటలో నుండరు. ఆరడందరిని దెలెంద్రునిలె గామెంద్రునిలె జూచును. అతనికంటె మంచితానుచితజ్ఞుడు లేడేమో!

అతని నొక కామమావేశించి మనసు త్రిప్పులు పెట్టి గగ్గోలు పఱచిన ఘట్టమతని జీవితములో లేదు. అతనికి స్త్రీవట్టి స్త్రీ. కామోద్రేక నివారకమయిన యొక సాధనము. తక్కినప్పుడు నామెయు నొక జీవుడు. ఇట్టి సారధి మనస్సులో నెవరోయొక తెరువు ఒక పనుకాదుట తానొక దోషిగానైనాసరేమో యన్న యనుమానము నీనికి మించి పూర్వమందననుభూతమైన యొక విచిత్రమైన సంతోషమేమో యనిపించుచున్న యొకరేఖ-యతనియంతఃకరణ ప్రవృత్తి యందు గదలాడెను. తనంతటతానే పోయి వాసంతికి సాహాయ్యము చేయవలెననిపించెను కాని మనస్సు తూగలేదు. అంతఃకరణము చెయుమన్నట్లున్నది. మనస్సు వద్దన్నట్లున్నది. ఇదియేదియు నతని మనస్సులో విస్పష్టముగా లేదు.

అతని మనస్సులో నొకయూహతోచినది. తానే వేషము ధరించినను సగానికి మించి తత్పాత్రలో, దా నేకీభవించుచుండును. అదియు తన్నింత మహానటునిగా, జేసినదని యతని యభిప్రాయము. తనయాగుణమునందు దన కర్త్యంతాభిమానము. ఈనాడు నట్లే జరిగినది. కాని యానాటి గనయేకీకృతి తన కనభిమతమైనది. ఈ నాటియేకీకృతిలో నొక యనిష్ట విషయము సంక్రమించినది. పూర్వము తాను హిరణ్యకశిపుడు వేసెను తానారాక్షస భావమునంత యునసుభవించెడివాడు. ప్రహ్లాదుడున్నచో గొనను నారాయణుడన్నచో ద్వేషమునసుభవించెడివాడు. కాని ప్రహ్లాద వేషము వేసిన పిల్లవాని మీద గోపములేదు. నృసింహ వేషధారియందు ద్వేషము లేదు. తన హిరణ్యకశిపు భావమునందలి యేకీకృతి ప్రహ్లాద నృసింహభావములలో బర్యవసించెడిది. ఈనా డట్లులేదు. తాను రుక్మాంగదుడుగా నభినయించినంతసేపు తానుమోహినీ భావమును జింతించలేదు. వాసంతిని జింతించెను. తన శృంగారభావము వాసంతియందు పర్యవసించెను. వాసంతిని మోహినిని విడివిడిగా చూడ లేకపోయెను. ఇది నీనిట్లు జరుగవలయును. పట్టుదలగా వాసంతి తానీ వేషమును ధరించునట్లు చేసినది. ఆ పసివాని పట్టుదలయు నామె యందలి తనకైన జాలిచేత ముద్దుచేత నామెకుదననిమిద గలిగిన యధికారము వీనినిగూర్చి భావించుచు వాసంతి మోహినీపాత్ర నెట్లు నిర్వహించును, తానే పాత్ర నిర్వహించును. తా నేదో పంగీతము పాడుకొనును గాని తన కభినయ మేమిచేతనగును. తన కొసట్టుదల యొందదు. లేదు. తాను తన శృంగార రసాభినయము జూపవలయునన్నచో తానే నాయికపాత్ర యుల ధరించవలయును. ఇట్టి యూహలన్నియు గలిసి జాలితోగూడిన యొక కోపము, ముద్దుతోగూడిన యొక నిరాకరణము ప్రేమతో గూడిన యొక నిరాకరణభావము సారధి మనస్సు నావరించెను, అదునెఱుగా నిట్టిభావము క్రమక్రమముగా వృద్ధిపొందెను. తా నానాడు రంగమునందు ప్రవేశించిన తోడనే సమస్త కౌతుకోద్రేకమూర్తియై నానాజనులను దిగ్భ్రాంతిపొందించు ... [illegible] ... రంగప్రవేశము చేయును. వాసంతి ... [illegible] ... చేయవలయునో తనకు దెలియును. తాను నవ్వుకొనును. ... [illegible] ... యుంచుము నామెపద్దతులలో యి సామాజికులకు వినిపించకుండ రంగముమీదనే లోగొంతుతో నామెతో 'పెద్దయభినేత్రితనవలెనన్ని వేషము వేయుమంటివి నీ వప్పటి కొయ్యబొమ్మవే' యని నామె నేడిపించవలయునని తలచెను. రంగము మీదం దనయట్టి ప్రవేశముచూచి వాసంతి మధుర లజ్జాభినయము చేయుటతో పరమసాత్త్వికాభినయము చేయుటలో నతడనుకొనిన వథకమంతయు మాఱిపోయినది. ఆమె యభినయమునజూచిన యానందము సారధిని సారధిగా నుండలేదు. అనుభవపరమూర్తియందు వానిని, శృంగారనాయకునిం జేసినది. ఆ విచిత్రమైన పన్నివేశము వాసంతియందు మోహినీభావమున పొకరించి వాసంతీ భావమును స్థిరపఱచినది. వాసంతీభావము నిరాకృతము కాలేదు. ప్రథమ నిమేషమున వాసంతీ ప్రశంసగానుండి మరునిముషమున యతని సహజమహానటుని ప్రకృతిచేత శృంగారరసముగా మిగిలిపోయినది. ఉభయులు తదభినయవేళ వారువారుగా లేరు. శృంగారభావము చేతనే వారి యాత్మలు సమావృతములై యుండెను. ఏకాదశీ శబ్దశ్రవణముచేత నతని మనస్సునకుం దెలివివచ్చెను. మిగిలిన నాటకము జరిగినంతసేపు వాసంతిలో నేమియు మార్పులేదు. వాసంతి నటియా. కాదు కనుక తాను దేవతలచేతం బంపింపబడిన యొక సాధనముగా భావించికొని రుక్మాంగదునియందలి మోహానుభవితీవి కొన్న భావము కలిగించుకొనుటకు.

జంతువులయందు యౌవనోదయమైనంతనే స్త్రీ పురుషభావన యంకురించును. ఈ భావనను సంఘము నియమములు మేరలను కల్పించును. అది సంఘమునందు సహజమైయున్నది. ఈ నియమములచేత మేరలచేత నా స్త్రీ పురుషసంబంధమైన భావన సహజముగనే పెరుగును. సోదరులయందు, దండ్రులయందు వరుసకానివారియందు నాగరక సంఘమునందు తద్భావాంకుర మేర్పడదు. ఇది సంఘము పెట్టినహద్దు. ఒకానొక ప్రకృతిసంఘమునుండి సంఘమర్యాదలయందు నిరాదరణకలిగినవాడైనచో సహజముగా సంఘమర్యాదల నెదిరించువాడైనచో నా యెదిరించుట కామభావమునందభివ్యాప్తమైనచో నా వ్యక్తియందు కామభావన సహజముగానుండి యీ నియమములను మేరలను పాటించదు. కామము ఒకనియందొక్కతీరుగానుండదు. ఇదియుం దక్కిన గుణములవంటిదే. శారీరక మానసిక గుణములు పలుమందియందు పలువిధములుగా నుండును. ఒకనికి భౌమిక పుష్టియుండును. మరియొకనికి లేదు. ఒడలిలో నొకనికి జీవితము సాగుటకు కావలసినంతి బలమేయుండును. అట్లే కామముకూడ నొకనియందు మిక్కిలి తక్కువగానుండును, ఒకనియందు సంసారపక్షముగానుండును. మఱియొకనియందు నధికముగానుండును. ఈ యధికముగానున్న వారే లోకమునందు జారులు. వారికది సహజముగదా. దానియందు దోషమేమియుండదు. లోకములోనున్న దుర్మార్గుల గుణములన్నియు సహజములే. వానికి శిక్ష యెందుకు. నాగరకజాతి శిక్ష విధించుచున్నది. అనాగరకజాతియందుంగూడ సంఘము శిక్షించుచున్నది. నాగరకతయు సంఘమును మానవప్రకృతి నియమితముకావలయునని వాంఛించుచున్నది. ఈ నియమమునకు మతము పారలౌకిక ఫలమున్నదని చెప్పుచున్నది. పారలౌకిక విషయములందు విశ్వాసములేనివాడైనను సంఘ సుస్థితికొఱకు మానవునియొక్క సహజప్రవృత్తియొక్క నియమములు వాంఛించును. ఒక మహాబలవంతుడు బలహీనులందఱను జంపుచున్నచో సంఘము తూష్ణీంభావము వహించదు. అట్లే యధికకాముకుడు పరభార్యారతి చేసినచో సంఘము సహించదు. ఒక మహాబలవంతుడు బలహీనులను పదిమందిని జంపినచో తప్పేమి? రాజ్యముయొక్క సుస్థితికి మంచి బలముకావలయును. ఇది నేటి రాజ్యాంగవిధాన పరమార్థము. ఒక వ్యక్తి చనిపోయినను యుద్ధభటుడు చనిపోయినట్లు, ఆ నష్టము రాజ్యమునకుం గలుగుచున్నది. అధికకాముకుని బహు స్త్రీ సంగమముచేత సంఘమునకుగాని, రాజ్యాంగమునకుం గాని యొట్టి దోషము,సంభవించుటలేదుకదాయని ప్రశ్నయైనచో జరుగుం లేదు. శిక్ష శిక్షించువానిమీదనే యాధారపడియున్నదా! శిక్షించువాని ప్రయోజనముమునుబట్టియే శిక్షయా! ఐనచో నొకనియాస్తి మరియొకడు తీసికొనినచో శిక్షింపనక్కఱలేదు. ఆ యాస్తి యెవడు తినుచున్నను రాజునకు వచ్చెడి పన్ను వచ్చును. కనుక నేదోఁసర్మమున్నది. ఆధర్మము స్త్రీ విషయమునగూడనున్నది.

ఇట్టి విచారణ యౌవనోల్బణదశలో నుండదు. మఱియు నొకస్థలమునందలి యధికశక్తి బహువిధములుగా నుపయోగపడుటకు వీలున్నను నా వ్యక్తియొక్క విశిష్ట ప్రకృతి హేతువు వనేకవిషయమునచే దాని యుపయోగము జరుగుచుండును. ఒకడు మహాబలశాలి. అతడు తన బలము పరులకు సాధ్యముకాని పనులయందె వినియోగించును. ఇతరులమీదికి బోవపోడు. అట్లే యధికకాముగలయొక ప్రకృతికూడ దతాక్కువభావ సర్వస్వము నొక వ్యక్తియందే వినియోగించును. వాసంతి యట్టిది. తన యధిక కామ భావమును మఱియొక వ్యక్తి సంఘ విద్రోహకరము కాకుండ ఫుల్లటాపులమునందు నెలవేర్పుకొనుచుండును. సారధియట్టివాడు.

ఒక్కొక్కప్పుడొక్క కామభావన కలదు లేదన్నట్లుండును. ఒక వ్యక్తియందు గౌరవముగా భాసించును. ఒకచోట జాలిగా భాసించును. ఒకచోట ముద్దుగా భాసించును. ఆ వ్యక్తియొక్క వివేకాదులను ప్రశంసించుటగా భాసించును. ఈ యీ భావములు యోగ్య సన్నివేశ సన్నికర్ష జరిగినపుడు కామముగా పర్యవసించును. వసంతి సారధుల యీ భిన్నప్రకృతులు నీవిలక్షణ ప్రకృతులు నేటి నాటకరంగముమీద గామభావనాభిముఖముగా మరలినట్లు వారిద్దఱనకావలేదు మనస్సులలో నట్లున్నది. సారధి యన్నచో వాసంతికున్న తదభినయ విద్యాపురస్కృతి గౌరవ ప్రశంసా భావముల కవధిలేదు. వాసంతియన్నచో సారధికి సహజముగా ముద్దు. ఆమెచక్కని గొంతువను చిన్నతనములో నంత సంగీతవిద్య నేర్చినందులకు నా ముద్దు ప్రశంసగా గౌరవముగా వృద్ధిపొంది యామె తనకంటె మిక్కిలి చిన్నదియగుటచేత నీ రెండు భావములు నా మొదటి భావములో లీనమై యదియొక విలక్షణమైన భావసంపుటి యైనది. పరస్పరము వారి యిరువుర నడుమగల యీ భావములు కామముగా పరిణమించుటకు వీలులేనంత వయస్తార తమ్యము కలదు. ఈ వయోభేదము వారి పరస్పర మృదుగౌరవములకు నడ్డుగా మహా పర్వతమువలె నిలిచినది. కాని కామభావన పొంగెత్తిన తుపానువంటిది. అది పర్వతములను లెక్కజేసెడిదికాదు. చూచెడివారికి నది యెంతి నదియైనను పొంగి కొండను ముంచునా యనిపించును. ఆ నదికి పట్టరాని వఱద వచ్చినపుడు కొండను ముంచివేయును. నదికిం గల పొంగునదికే తెలియును. ప్రక్కనున్న చెట్లకు తెలియదు. ఊరికుం దెలియదు. ఈ ప్రేమయే యా చెట్లులోననో యాయూరిలోననో పుట్టినచో నదియు నట్లే పొంగును. కాని యది దూరమ్ముగా నిలుచుండి నదిని విమర్శించును. అది యట్లు పొంగుటయు నిది విమర్శించుటయు లోకసహజము. ఆ పొంగినవదికి కట్టలుకట్టి మరల నూర్ఛవిూదికి రాకుండ మెట్లుముంచకుండ దాని నదుపులోం బెట్టుటయు లోకోపకారకమని తలచుటలోకముయొక్క సహజత్వము.

సారధి వేషము తీసి వేసికొనుచుండెను. రాజ వేషము వేసినవాడు సామాన్యముగా కేయూరములు కట్టరు. కేయూర భావను వారికిలేదు. కేయూరము లని గ్రంథములలో జదువుటయేకాని దాని స్వరూపమెట్టిదియో యెవ్వరికిం దెలియదు. ఆ సారధియొక విచిత్ర పురుషుడు. అతడు వట్టి నటుడును కాదు. అంతకుమించిన సూత్రధారియుం గాడు. అతనికిం దెలిసిన యాహార్యక విద్య యతనికే తెలియును. అతడొక వేషమువేయ సంకల్పించినచోం దొలుత వేషధారణలను గుఱించియే కొన్ని నెల లూహించును. అతడెట్లా కూహించెనో తెలియదు. ఒక విచిత్రమైన కేయూరములు భుజముల నవధరించెను. అవి దూరమునుండి చూచినచో నొక పట్టుతువాలా రెండు బుజములమీదికి వచ్చినట్లు కప్పినట్లు కనిపించును ఆ తువాలకు రెండువైపులం ద్రాక్షపండ్ల ముళ్లు వేసినట్లుండెను. ఆ ముడులకు బదులు పన్నని ముత్యములు ప్రేలాడుచుండెను. అచ్చముగా జరీపోగులతో నేసిన సన్నని నుస్తువలె నుండెను. అతని యొడలికి పసికొనిన బంగరు రంగునకు నీ కేయూర వర్ణమునకు చాయా భేదము కలదు. ఆ కేయూరవర్ణ మే యతని బొమ్మనందుకూడం గలదు. వక్షప్రదేశమునకు దిగువ నాభిపర్యంతము వేసిన పన్నెయ కొంచెము తక్కువ మెఱుపుకలదిగానుండెను. ఏదు బొమ్మలంతయు మంగారువన్నె. వక్షస్థలము మిక్కిలి పసిమి కుక్షిభాగమున నా పసిమియే కొంచెము వన్నె తక్కువ. కుండెకడనుండి నాభి పర్యంతము సన్నని శ్యామరేఖ. బొమ్మకాంతిలోం కేయూరకాంతి కలసి పోవుచున్నది. కాని వర్ణవిభాగమును జూపించుచునే యున్నది.

అట్టి కేయూరమును సారధి తీసి వేసెను. నక్కుగుడ్డ తెచ్చి దానిచేతో విలక్షణముగా నుటించెను. నాటిరాత్రికి నాటకమునగా లేదా నాటకము రేపురాత్రియైనగా వలెను గుడ్డలను గొనుటకు పోయి చిన్న చిన్న పేటికలుకొనును. అవి యెవరికిం గావలయు ననుకొన్న చిరుగుడ్డలు. పేటికలు పేటికలుగా రెండంగుళములు మూడంగుళములుగా కొనును. వానిని పట్టువానిప్రక్కన గూర్చుండి పట్టంచుకు, కొన్నిటిని తానేపట్టును. ఆ దర్జీవాడొకడున్నాడు. వానికరువదియేండ్లు. అతడు జంగము. అతనికిని సారధికిని నెయ్యము. అతడు నలుబదియేండ్లుగా సారధినెఱుంగును. ఆ దర్జీవానికి సారధియన్నచోం జెప్పరానంత గౌరవము. సారధికంటె మహానటుడు సృష్టిలోంబుట్టడని యా దర్జీవాడు చెప్పును. వాని పేరు కుండి. నలుబదియేండ్లలోం గనీసము ముప్పదియేండ్లలో సారధివేసిన యొక్క వేషమైనను కుండిచూడలేదు. కుండి గొప్ప దర్జీపనివాడు అతని చేతి క్రింద నలుగురైదుగురెప్పుడు పనిచేయుచుండురు. యంత్రముమీదం దక్కన వారు కుట్టగా నతడు చేతిపనిని చేయును. అతనియుద్ధ నొకసారి చొక్క కుట్టించినవాడు మరియింకొకనివద్దకు పోనేపోడు. అతడలుసుపు పనులుముట్టడు. చిన్న పనులతనివద్దకుం దీసికొనిపోయినచో నతడు నిరాకరించును. ఏవగించుకొనును. సారధి యీ గుడ్డపేలికలు తీసుకొనిపోయి కుట్టుమన్నచోం దాను కొంతముగాం గుట్టును. అతడు తప్పుగాం గుట్టినచో సారధి వానిని తిట్టును కుండి యొవ్వరిచేతను 'ఓరి' యనిపించుకొనడు. సారధి 'ఓరి'మాత్రమే కాదు. "నీవు జంగమువాడవు కాదురా. కొండముంగలివాడవు." అనును. కుండి నవ్వును. కుండిజుట్టు ముగ్గుబుట్టవలె నెఱసెను. అతని మొగము కండలు తేరియుండును. తెల్లని మున్నమీసముల నుబురు వాని చెక్కిళ్లయందు గంభీరముగ నుండును. అతని మొగమునందలి గాంభీర్యముచూచియే వానినెవ్వరు చులకనగా మాటాడరు. కుండికిం గొడుకులున్నారు వారికిం దండ్రియన్నచో నమితప్రేమ సారధివచ్చి తండ్రిచేత నిట్టిగుడ్డలు కుట్టించుకొనునపుడు కుండినతడు తిట్టుచున్నపుడు వారతనినిజూచి యాశ్చర్యపడుచుండురు. సారధి వెడలిపోయిన తరువాత కుండి వారితోననును. "మన కుట్టుపనివిద్య సారధికింత యొట్లు తెలియునో" యని.

కుండి యిదివఱకెన్నిసార్లో 'సారధికి' విచిత్రవిచిత్రములైన పనులు చేసిపెట్టెను. ఈ కేయూరములు కుట్టినపుడు అనగా కడచినరాత్రి కుండి పొందిన యచ్చెరువుకు మితిలేదు. ఒకసమయమున వానిచేతిలోని సూది పనికి రాలేదు. ఇది యెట్లు కుట్టుట యని యడిగెను సారధి చిన్నకత్తి తీసికొని యొడను బొట్టనవ్రేలి గోరును అంచుమునలెకోసి దానితో కొన్ని చోట్లనొక్కించి కుట్టించెను. కుండి "నీవెవరవు. పూర్వ మెవడోచక్రవర్తికి దుస్తులుకట్టినవాడవు ఇప్పుడీ జన్మనెత్తితి"వనును సారధి బ్రహ్మానందపడెను. కుండిని గౌగిలించుకొనెను. "జోకోయి! నేను నటుడనుకాను. కుట్టుపనివాడను అందుకనియే నీకు నాకు నింతచెలిమి" యనెను.

ఆ కేయూరము సారధికిం బరమ ప్రియమైనది. అది కుట్టించిన దెట్లనెవరికిం దెలియదు. నాటకములోని వేషధారులందఱు సారధి రంగముమీదికి వచ్చుచుండగనే దానిని జూచిరి. అదియేమిటో వారెవ్వరికిం దెలియలేదు. కాని యది బుజములమీద వేసికొనుటచేత సారధి చక్రవర్తివలెంగనుపడుచుండెను. అంత చక్రవర్తిలక్షణము తెచ్చుధారికిం బ్రసాదించిన యా కేయూరములను భావించిన సారధి యామాటెట్టిదో యెవ్వరికి దెలియదు. వాసంతి తానభినయించినంతసేపా కేయూరములవంకనే జూచుచుండెను. ఒకసారి యా కేయూరముల స్పృశించెను. సారధి యామెను నివారించెను. "కేయూరములు రాజచిహ్నములు. వానిని తాకరాదు తాకినచో నభినయము తెలియదన్నమాట" యనెను. వాసంతి కతనిమాటలువిని భయము వేసెను. ఆతడంతలో నామెను లాలించెను, ఆమె భయముబాసెను. కేయూరములు తీసి సారధి చేతితోం బూనెను. అతనిపద్యస్ఫురణగా వాసంతి దానిని తావుటయు తాను వలదనుటయు జ్ఞాపకమువచ్చెను. వాసంతి యేమనుకొనినదో! చిన్నపిల్ల వానిని తాను స్పృశించుట. ప్రేమాధిక్యము మాపించుట యనుకొనెను."

ఈభావము వెంటనే సారధికి మఱియొకభావము గోచరించెను. వాసంతి యట్లనుకొనినదా యనుకొనకుండ చేసినదా! వచ్చినయీయూహను సారధి వెంటనే పరిహరించెను. కాని యాయూహ మరల మరల వచ్చుచుండెను. ఆయన విస్పష్టమైనభావము విస్పష్టతాదశకు తీసుకొనివచ్చుటకు సారధికి మనోబలము చాల లేదు. వాసంతి చేతికిం గుంకుమరన్నె యలందంబడియుండెను. ఆమె చేయివేసిన చోటం గేయూరము కొంచెమెఱ్ఱవన్నె కలిగియుండెను. ఆ కేయూరమునుండి ఆయెఱ్ఱరంగును దీసివేయుట యెట్లు? అదియుదుకరానిగుడ్డ, పబ్బు పెట్టరానిగుడ్డ. అంతలో సారధికి నవ్వువచ్చెను. మరల నీకేయూరములతోడి పనియేమి? ఇంక తానెప్పుడును రుక్మాంగదుని వేషము ధరించడు. ఇదియే మొదటి సారి ఇదియే తుదిసారి. మరి యా కేయూరము నంతజాగ్రత్తగాం దానెందుకు జూచుచున్నాడు. అది తన నేర్పునకు లక్ష్యముగానుండెను. దానివెల యెంత? అది యంతయుం గలిసి రెండురూపాయల లోపయ్యెను. ఆకేయూరములయందుం దననొక మమకారము కలిగినట్లు భాసించెను. వాసంతి దానిని ముట్టుకొన్నచో దానట్లనవచ్చునా! వాసంతి పసిపిల్ల. నొచ్చుకొనదా. నొచ్చుకొనదా యేమిటి నొచ్చుకొన్నది. నిజముగా కేయూరములను ముట్టుకొనరాదు. అట్లు తాకినచో రాజమర్యాదకు లోపము. అంత సూక్ష్మమైన తాను భావించిన యాచార రహస్యము సామాజికులలో నెవరికిం దెలియును. అభినయము తావంతసూక్ష్మముగా నభివ్యాప్తమైయుండునని సామాజికులలో నెవ్వరికిం దెలియును. ఇది తెలిసినవాడు సామాజికులలో ఒకడుండెను. ఈయూహ వచ్చిన వెంటనే సారధి మనస్సునకు వెంటనే యతడు తగిలెను. అతడెంతవాడనగా దానిని తాకవలదని తాను వాసంతితో రహస్యముగా జెప్పినదికూడం దెలిసికొనంగలవాడు. సారధియొక లోకోత్తరమైన యనుభవము చేసినచో సభలో నతడున్నాడని యేచేయును.

ఇంతటి సారధియుం గొన్ని కొన్ని సభలయందు సరిగాం జేయలేదనిపించుకొనుచుండును. ఆసమయములామహాభావుకుడు గ్రామములో లేనిసమయములు, అతడు నాటకమునకు రాలేదని సారధికిం దెలిసిన సమయములు ఆమహాభావుకుని పేరు ఉమాపతి. ఉమాపతిని దలచినంతనే సారధికి వాసంతిని గూర్చిన భావన పన్నగిల్లెను. అతనిలో నొకయానందరేఖ తోచెను. మరునాడుమాపతితో తాను కలిసికొనును. అతడు తన కేయూరమునుగూర్చి యేమనునో వినవలయును. సారధికి ఉమాపతియొక్క ప్రశంస వినుటయే పరమానంద హేలాడోలాదికారము. తన నాట్యవిద్యకు నుమాపతి ప్రశంస పరమార్థము. అతడుమాపతికొఱకభినయించును. అతనికిం దనయభినయము చాలదు. ఉమాపతి దృష్టిలోం దానొక నారాయణుడు. తాను మహాశిల్పి. తాను భట్టాచార్యుల యపరావతారము. ఒకానొకయేశిల్పము ఒక మహాశిల్పియొక్క శిల్పసర్వస్వము నాశిల్పి యొఱిగియున్న యొకమహాభావుకున కభిముఖముగాం బోవుచుండును. అతని ప్రశంస మాఱగొనుటకే యాశిల్పము సూక్ష్మసూక్ష్మదశలందుచుండును. ఆయుమాపతి సారధి మనోవీధిని స్పృశించినంతనే సారధి కేయూరములు తీసి దాచెను. ఆ సమయటి సారధి వేఱు. ఈసారధి వేఱు. తత్పూర్వనిమేష సారధి వాసంతీ మనస్కుడు. ఒకానొక యవిస్పష్టమైన సంశయితమైన యస్తినాస్తి విచికిత్సాహేతువైన యొక శృంగారభావనము. పేతాపేతచిత్తుడు. ఈసారధి వట్టిశిల్పి. తానొక మహానటుడు. తన నాట్యచాతుర్యమంతయు మఱునాడుమాపతి ముఖమునం బ్రశంసించుకొనుటకుం దొందఱపడుచున్న మనస్సు కలవాడు. ఉమాపతి మనస్సునకుం దగిలినంతనే యతని మనస్సునుండి వాసంతి నిష్క్రమించెను. ఆమె తిరోహిత యయ్యెను. ఆమె తిరోహిత యనగా మోహినీ రూపధారిణియైన వాసంతియొక్క తిరోహితత్వము ఆ వేషము తాల్చిన సమయమునందలి వాసంతి నావరించియున్న యొకానొక భావముయొక్క యంత ర్హితత్వము. సారధి తొందర తొందరగా వేషమును దీసివేసికొనెను. వాసంతి పాప మిబ్బందిపడుచున్నది. ఆమెవద్దకు బోవలయును. పసిపిల్ల ఆమె కేమి తెలియును. ఉమాపతి భావనావిధూతశిఖాభూతశృంగారభావ సముచిత మనస్కుడయిన సారధికి వాసంతి మరల పసిపిల్లగా భాసించెను. తన ముద్దునకు తన జాలికి స్థానముగా భాసించెను. ఈ కేయూరము లెచ్చట నెట్లు పదిలపఱుపవలయునో యతనికిం దెలియలేదు. అవి కుట్టించినపుడు వానిని దాచవలసిన ప్రదేశమును గుఱించి భావించలేదు. క్రొత్త వస్తు వొక చమత్కారము. అందులో వస్త్రసంబంధి యొకసారి ధరించువరకు దాని భద్రపఱచుటలో గమనములేదు. ఒకసారి తాల్చినతరువాత దానిని భద్రపరచుటలో నొక శ్రైశమేర్పడును. తొలుతటి మడతలయు వణుకువలయుంబోయి యది మఱియొకరకపు మడతలతో దొలియణుగుల లేకుండ మఱియొక వస్తువువలె గన్పించును. అప్పుడు దాని దాచుట కష్టమగును. వస్త్రముయొక్క శరీరముతో సన్నికర్ష జరుగువరకు నది కన్నెవంటిది. ఒకసారి ధరించుటతో దాని కన్నెతనము చెడినది.

సారధి నవ్వుకొనెను. తాను దుస్తులు పెట్టుకొను పెట్టెయుండెను. అందులో నొక పెద్ద పెట్టెయంతయు నీ కేయూరములకొఱకు తదితర వస్తురహితము చేయవలసివచ్చెను. అట్లే చేసి కొన్ని వస్తువులు బయటనే పెట్టి పెట్టెకు దాళమువేసి యొడలి రంగంతయు గడిగికొనకుండగనే వాసంతి గదిలోనికి బోయెను. వాసంతి యచటలేదు. వారినివీరిని నడిగెను. వారు దమకు దెలియదనిరి. ఆమె గదిలోనుండి దొడ్డివైపునకు ద్రోవ కలదు. అతడు దొడ్డిలోనికి బోయిచూచెను. ఆమె యచ్చటను లేదు సామాజికు లెవరివారి వారుపోయిరి. మఱియెవ్వరినో యడిగెను. ఒకడు వాసంతియు నామెతండ్రియు కలసి వెడలిపోయిరని చెప్పెను. నాటకమైనంతనే వారిద్దరు వత్తురు. వాసంతితండ్రి తన్నెప్పుడు ప్రశంసించును. తరువాత తండ్రి కూతురు లిద్దరు కలసి పోవుదురు. ఇది యలవాటు. ఈనా డిదియేమి? వాసంతి భావనావిగళిత చేతస్కుడయిన సారధి వాసంతీ భావనాపునస్సహిత చేతస్కుడు. వాసంతియొక్క వేషపరికరము లందు పేటిక సారధికి దెలిసినంతగా వాసంతికి దెలియదు. అతడామె గదిలోనికిపోయి పేటికను బరిశీలించెను. పేటిక యంతయు చిక్కుచిక్కుగా నుండెను. ఆమె వేషము తీసివేసినట్లులేదు. అది దేమిచేయవలయును. పోయి తన మొసలు కడిగికొనవలయును. ఒడలంతయు నానియురాచి గుడ్డతో తుడిచికొని సబ్బుతో దోముకొనవలయును. ఆ నా సంగతియు మరచిపోయెను, అప్పటి కెన్నిగంటలైనదో యతనికి తెలియదు. కాని యతని కాకలి వేయుచుండెను. అతడు వేషము వేయవలసి వచ్చినచో నారాత్రిపూట భోజనము చేయడు.

అక్టోబరు 24 వ తేదీ సాయంత్రం న్యూఢిల్లీలో ఆకస్మికంగా చనిపోయిన కేంద్ర ఆహారమంత్రి శ్రీ రఫీ అహమ్మద్ కిద్వాయ్ మృతకళేబరంపై రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ స్వయంగా పూలమాల వేస్తున్నారు.

ఆంధ్ర ఆర్థికమంత్రి తెన్నేటి విశ్వనాధంగారు ఆంధ్ర టేబిల్ టెన్నిస్ అసోసియేషన్ పోటీలను ప్రారంభించినప్పటి ఫోటో. ఇందులో శ్రీయుతులు టి.వి షన్ముఖశాస్త్రి (అసోసియేషన్ ఛైర్మన్)గారు ప్రసంగిస్తుండడం చూడవచ్చు.

అనకాపల్లి పత్రికసంఘ పుష్కర వార్షికోత్సవంలో ఉపన్యసిస్తున్న రాష్ట్రగవర్నరు శ్రీ చందూలాల్ త్రివేదిగారు. ఆ దేనభలో ఆంధ్ర వాణిజ్యమండలి అధ్యక్షులు శ్రీ జె. వి సోమయాజులుగారు ఆంధ్రదేశంలో బెల్లంపరిశ్రమను గురించి ప్రసంగిస్తున్న దృశ్యం.

# కమ్యూనిజం ఇస్లాం ప్రకారం నిషిద్ధం

## ఇండోనీషియా ముస్లిం మతనాయకుల ప్రకటన

జకార్టా, అక్టోబరు 27: కమ్యూనిజం ఇస్లాం న్యాయాన్ననుసరించి నిషిద్ధమని ఇండోనీషియా ముస్లిం మతనాయకులు ప్రకటించినట్లు ఇవ్వాళ తెలిసింది. కమ్యూనిస్టు-మార్క్సిస్టు ఆశయ సిద్ధాంతాల అర్థనిర్ణయకు మొన్న ఆదివారం ముస్లిముల సభ ఒకటి జరిగింది. అందులో ఈ నిర్ణయానికి వచ్చి, ముస్లిము లెవరూ కమ్యూనిస్టు పార్టీలో గానీ, ఈ విధమైన ఆశయసిద్ధాంతాలు గల మరేపార్టీలో గానీ చేరరాదని విజ్ఞప్తి చేశారట.

ఈ మధ్యభారత ప్రభుత్వ ఆర్థికమంత్రి శ్రీ చింతామణి దేశముఖ్ వారి సతీమణి శ్రీమతి దుర్గాబాయమ్మ గారలు అమెరికా వెళ్ళినప్పుడు, న్యూయార్కులో వారు బసచేస్తున్న హోటల్‌సావాయ్ ప్లాజాకు వెళ్ళి, డా॥ పసుపులేటి గోపాలకృష్ణయ్య (ఇండియన్ ఎడిటర్ అండ్ పబ్లిషర్) గారు వారిని కలుసుకొన్నప్పటి ఫోటో.

# కొత్త ప్రాథమిక పాఠశాలల ప్రారంభం తాత్కాలికంగా వాయిదా

## కుప్పుస్వామి కమిటీ సిఫార్సులపై ప్రభుత్వ పరిశీలన పూర్తి అయ్యేవరకు

కర్నూలు, అక్టోబరు 27: ప్రాథమిక విద్యావిధానంపై కుప్పుస్వామి కమిటీ సిఫార్సుల రాష్ట్రప్రభుత్వం క్షుణ్ణంగా పరిశీలించి ఒక నిర్ణయానికి వచ్చే యీలోపుగా, రాష్ట్రంలో కొత్తగా ప్రాథమిక పాఠశాలలను ప్రారంభించడం తాత్కాలికంగా నిలిపి వేయబడింది.

ఆంధ్ర మంత్రివర్గ ఆర్థిక స్థాయీ సంఘంవారు ఇటీవల చేసిన నిర్ణయానుసారం గ్రామాలలో ఒక ఉపాధ్యాయునితో పనిచేసే పాఠశాలలను కొత్తగా స్థాపించాలనే ఆలోచన ఉన్నట్లు, అందుకే కొత్తగా ప్రాథమిక పాఠశాలల ప్రారంభం తాత్కాలికంగా నిలిపి వేయబడినట్లు భావించబడుతున్నది. 500 అంతకు యెక్కువ జనాభా గలిగిన గ్రామాలలో ఒక్క ఉపాధ్యాయునితో మాత్రం పనిచేసే పాఠశాలలను వెయ్యింటిని ప్రారంభించాలని ఆర్థిక స్థాయీ సంఘం నిర్ణయించిన సంగతి పాఠకులకు విదితమే. ఇలాటి పాఠశాలల స్థాపనకు భారత ప్రభుత్వం డబ్బు కేటాయించింది. ఆ అవకాశాన్ని వినియోగించుకొనుటకు, ఆర్థిక స్థాయీ సంఘం ఈ నిర్ణయం చేసింది.

కొత్త ప్రాథమిక పాఠశాలల ప్రారంభమును తాత్కాలికంగా నిలిపివేయాలని ప్రభుత్వంలో నిర్ణయం చేయకముందే ప్రాథమిక పాఠశాలలేవైనా ప్రారంభించబడి యున్నట్లయితే వాటికి త్వరలో విద్యాశాఖాధికారులు గుర్తింపు నిస్తారు.

ప్రాథమిక పాఠశాలలకు సంబంధించిన ఈ విషయ మంతటిపై రెండు మూడు వారాలలో ప్రభుత్వం ఒక నిర్ణయానికి రావచ్చునని తెలుస్తున్నది. కుప్పుస్వామి కమిటీ సిఫార్సుల ననుసరించి ప్రాథమిక ఉపాధ్యాయుల జీతాలను హెచ్చించాలనే విషయం కూడా ప్రభుత్వ పరిశీలనలో వున్నది.

# కొడవలివారి పాలెం బంజర్ల ఆక్రమణ

## 23 గురికి 6 నెలల ఖైదు

చీరాల, అక్టోబర్ 26: కొడవలి పాలెం బంజరుభూములలో అక్టోబరు 14 న ప్రవేశించారనే నేరమునకు, క్రితం శుక్రవారంనాడు 23 గురికి తలా ఆరునెలలు శిక్ష, తలా 100 రూ. ల జరిమానా విధించబడింది. ఈ 23 గురిని బళ్ళారిజైలుకు పంపారు. పి. టి. ఐ.

# అఖిలభారత వేదాంత మహాసభ

అమృతసర్, అక్టోబరు 26: అఖిల భారత వేదాంతమహాసభ 8 వ సమావేశం 8 రోజులపాటు జరిగి నేడే పూర్తిఅయింది.

# ఆంధ్రలో ఆయుర్వేదవైద్య వ్యాప్తికి ప్రభుత్వ చర్యలు

## గౌరవ డైరెక్టర్ను నియమించనున్నట్లు ఆరోగ్యశాఖామంత్రి సూచన

కర్నూలు, అక్టోబరు 26: ఒక గౌరవ డైరెక్టరు అధిపత్యాన దేశీయ వైద్యానికి ఒక ప్రత్యేకశాఖ నిర్మాణం విషయమై ప్రభుత్వం త్వరలోనే నిర్ణయం గావించనున్నదని ప్రజారోగ్య శాఖ మంత్రి డి. సంజీవయ్య గారు నిన్న సాయంత్రం ఇక్కడ ఉద్ఘాటించారు.

దేశీయ వైద్యానికిగాను నియమించిన అంధికార సంఘంవారి యీ సిఫార్సులలో ఆయుర్వేద కళాశాల స్థాపన కూడ ఉన్నదనీ, ఈ సిఫార్సును ప్రభుత్వం శ్రద్ధగా పరిశీలిస్తున్నదనీ కూడా ఆయన అన్నారు.

కర్నూలు ఆయుర్వేద పరిషత్తువారు స్థానిక సంస్కృత పాఠశాల ఆవరణలో ఏర్పాటుచేసిన ధన్వంతరి జయంతి ఉత్సవాలకు సంజీవయ్యగారు అధ్యక్షత వహించారు. ఆయుర్వేద, హోమియో పతీ, యునానీ వైద్యులు చాలామంది హాజరయ్యారు. ఆంధ్రరాష్ట్రంలో దేశీయ వైద్యపద్ధతులన్నిటినీ సాధ్యమైనన్ని విధాలా అభివృద్ధి పరచడానికి ప్రభుత్వం నిజంగా శ్రద్ధవహిస్తున్నదని ఆయన హామీ యిచ్చారు.

తెన్నేటి విశ్వనాథంగారు (ఆర్థిక మంత్రి) ఈ ఉత్సవాలకు ప్రారంభోత్సవం జరిపారు. దేశీయ వైద్యాల అభివృద్ధికి ఆంధ్రప్రభుత్వం ఎన్నడో ఉపక్రమించిందనీ, అందుకై చాలా చర్యలు తీసుకొన్నదనీ, కొన్ని సంస్థలకు గ్రాంటు కూడా ఇచ్చిందనీ, అలోపతీవైద్యానికి ఎక్కువగా సహాయం చేస్తున్నదంటే ప్రభుత్వం దానిపై పక్షపాతం వహించికాదనీ, దేశవ్యాప్తంగానూ, ప్రపంచవ్యాప్తంగానూ దానికిగల ఆదరాన్ని బట్టి మాత్రమేననీ ఆయన చెప్పారు. దేశీయవైద్యాల పట్ల కూడ ప్రజలు అటువంటి ఆదరాభిమానాలు పుట్టుకొనివచ్చేటట్టూ, వైద్యావసరం వచ్చినప్పుడల్లా దేశీయ వైద్యాలకు పరుగెత్తుకొని వచ్చేటట్లూ దేశీయ వైద్యులు పాటుపడాలని ఉద్బోధించారు. తమ వైద్యాలను కూడ శాస్త్రీయ పద్ధతులలో అభివృద్ధి పరచుకోవాలని కోరారు. అలోపతీవైద్యం మీద ప్రజలు ఎంత ఆదరం చూపుతున్నా, అది చాలా వ్యయసాధ్యమైనందున అందరికీ అట్టే అందుబాటులో లేకుండా ఉన్నదనీ, ఇది అదనుగా తీసుకొని దేశీయ వైద్యులు తమ వైద్యాలను ప్రజలలో బాగా వ్యాపింప చేయాలనీ చెప్పారు.

# కోళ్లపెంపకం కేంద్రంలో కొత్త యంత్రం

ఆలూరు, అక్టోబరు 25: రాయలసీమ ప్రభుత్వ కోళ్లపెంపకం కేంద్రంలో కోడిగ్రుడ్లను భద్రపర్చుటకూ, పొదుగుటకుగాను ఒక కొత్త యంత్రాన్ని స్థాపించనున్నట్లు తెలియవచ్చింది.

గత సంవత్సరం 10 జాతికోళ్లతో ప్రారంభమైన కేంద్రం, నేడు 100 జాతికోళ్ళలో అభివృద్ధి పొందుతోంది. క్రిందటి సంవత్సరం 1230 గ్రుడ్లుమాత్రమే ఉత్పత్తిచేయబడాయి.

ఆలూరుకు మూడు మైళ్ళ చుట్టు ప్రక్కలఉన్న గ్రామాలలోని కోళ్ళకు టీకాలు వేశారు.

మదరాసు, అక్టోబరు 27: చైనా రిపబ్లిక్ వరక రాయబారం వారు రేపు 28 వ తే॥ సా॥ 4-30 గం॥ ఆంధ్ర వాణిజ్య సంఘ సభ్యులను కలుసుకుని చైనా భారతదేశాల మధ్య వర్తక సంబంధాలను గురించి చర్చిస్తారు.

# రాజమండ్రిలో బందిపోటు

## 900 రూ. ల ఆస్తి అపహరణ

రాజమండ్రి, అక్టోబరు 25: మొన్న 23 తేదీ రాత్రి యీ పట్టణంలో వీరభద్ర పురంలోని శ్రీ పోలుకు వెంకట జాగర్లమూడి ఆనే వైశ్యుని యింట్లో దొంగలు (యిద్దరు) ప్రవేశించి గృహస్థులను (యిద్దరు పురుషులు యిద్దరు స్త్రీలు) మేలుకొని రాగా, వారిని చంపుతామని బెదిరించి సుమారు రు 900/ విలువగల స్త్రీల వంటిమీది నగలనూ, పురుషునిచేతి గడియారమూ తీసికొని పలాయనము చిత్తగించారు. చోరీ నేరాల దర్యాప్తుకై నియమించబడిన ప్రత్యేక రక్షకభటవర్గము వారీ నేరమును దర్యాప్తు చేయుచున్నట్లు తెలుస్తున్నది. (స్వ. వి.)

# అయోధ్య గుండం హత్యకేసు

## ముద్దాయి నిర్దోషి అని సెషన్సుజడ్జి తీర్పు

బందరు, అక్టోబరు 28: కృష్ణాజిల్లా సెషన్సుజడ్జి కె. వి. కృష్ణారావు గారు దివి తాలూకా అయోధ్యగుండం గ్రామనివాసి కుర్రకుల సుబ్బయ్య అను ముద్దాయి ఐ. పి. సి. 302 సెక్షన్ క్రింద నేరము రుజువుకానందున 30 వ తేదీన తీర్పు చెప్పుతూ ముద్దాయిని విడుదల చేశారు.

18-12-53 తేదీన పొలముల తగాదాలో ముద్దాయి కొంత పిరకాయ్యంతో హతుని పొలములోనికి నీళ్ళు పెట్టుచునిగొడ్డలితో చంపెనని ప్రాసిక్యూషన్ నేరారోపణ, ప్రాసిక్యూషన్ తరపున 15 మందిని విచారించారు. ముద్దాయి తరఫున ఎవరినీ విచారించలేదు. ముద్దాయి నేరముచేయలేదని వాదించారు. అసెసర్లందరు ముద్దాయి నేరము చేయలేదని అభిప్రాయమిచ్చారు. జడ్జీగారు అసెసర్ల అభిప్రాయముతో ఏకీభవించి ముద్దాయి నేరము చేయలేదని తీర్పు చెప్పారు.

ప్రాసిక్యూషన్ తరపున పబ్లిక్ ప్రాసిక్యూటరు కె. వి. మల్లికార్జునరావు, ముద్దాయి తరఫున శ్రీయుతులు మండలి శ్రీనివాసరావు, మండలి వెంకటరామారావుగార్లు వాదించారు. (స్వ. వి.)

ఈ నెల 23 తేదీన గుంటూరు ఎ. సి కాలేజి అసెంబ్లీహాలులో క్రిస్టియన్ హరిజన సేవకోద్యమ మహాసభకువచ్చిన పెద్దలు. ఇందులో శ్రీయుతులు టి. ఎస్. ఎస్. బెజవాడ గోపాలరెడ్డి, జగ్జీవనరాం, అనంతశయనం అయ్యంగార్ కొత్తరఘురామయ్యగారలు ఉన్నారు.

గుంటూరు రత్నాహాలులో కేంద్రప్రభుత్వ కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ. జగ్జీవనరాం గారికి వెనుకబడినజాతులవారు స్వాగతమిచ్చినప్పటి దృశ్యం.

కేంద్రప్రభుత్వ కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ జగ్జీవనరాం యీ నెల 24 వ సీతానగరందగ్గర కృష్ణా నదమీద నెలకొల్పనున్న "కృష్ణా బ్రిడ్జి" స్థానాలను పరిశీలిస్తున్నారు.

# అమెరికాతో సింహళ ప్రధాని చేసే సంతకాలు

## అటోగ్రాఫులే నట

కొలంబో, అక్టోబరు 27: కట్నేషన్లో సింహళప్రధాని సర్ జాన్ కొటెలవాలా అమెరికాదర్శించినపుడు అక్కడ ఆయనచేసే సంతకాలు ఆటోగ్రాఫులే. మాత్రమేనని విదేశాంగశాఖ కార్యదర్శి చెప్పారు.

అమెరికాతో మైత్రీత్వం గురించి ఒక ఒప్పందంపై సంతకాలు చేయటానికి కొటెలవాలా మంత్రివర్గ ఆమోదం కోరనున్నారన్న పుకారును ప్రస్తావిస్తూ పై విధంగా ఆయన చెప్పారు. (యు. పి. ఐ)

# ప్రదేశకాంగ్రెసు ప్రతినిధి ఎన్నికలు

విజయవాడ, అక్టోబరు 25: భారత జాతీయకాంగ్రెసు 60 వ వార్షిక మహాసభకు, పశ్చిమ గోదావరిజిల్లానుండి జరిగే ప్రతినిధి ఎన్నికల నిర్వహణకు జిల్లా ఎన్నికల అధికారిగా శ్రీ కొనువాడ వెంకటసూర్య ప్రకాశరావు నియమింపబడినట్లు ఆంధ్రప్రదేశ కాంగ్రెసు ఆఫీసు కార్యదర్శి చిదంబరశాస్త్రి గారు తెలుపుతున్నారు.



Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No 7. Thambu Chetty St, Madras.